టను, కోరుదురు = కాంక్షింతురు. ఉదాహరణము-ఎందుక్ = ఎక్కడను, చకోరపున్ + పక్షులు = వెన్నెల పులుఁగులు, చంద్రికా + అపేక్షన్ = వెన్నెలమీఁదియాసతో, చెలంగి = ఆనందించి, చంద్రుఁడు = ఇందుఁడు, ఉదయించు, విధంబునకున్ + ఐ = ఉదయమయ్యెడు, రీతికై, పూని = ప్రయత్నించి, అపార + ముదంబునన్ = దరిలేని యానందముతో, ఎదురు, చూడవే = వేచియుండుట లేదా.

తాత్పర్యము. ధనాశగలజనులు మంచిప్రభువుగలుగ వలెనని కోరుదురు. వెన్నెలకై చకోరములు చంద్రోదయమునకై యెదురుచూచుట పైదానికి దార్కారణము.

ఉ. ఈజగమందుఁ దామనుజుఁడెంత మహాత్మకుఁడైన దైవమా
తేజముతప్పఁజూచు నెడఁ ద్రిమ్మరి కోల్పడు నెట్లనన్మహా
రాజకుమారుఁడైన రఘురాముఁడు కాల్నడఁ గాయలాకులున్
భోజనమైతగ న్వనికిఁ బోయి చరింపఁడె మున్ను భాస్కరా.

టీక. భాస్కరా! ఈజగమందున్ = ఈలోకములో, మనుజుఁడు = జనుఁడు, తాన్ - ఎంతమహాత్మకుఁడు + ఐనన్ = తా, నెంత మహిమగలవాఁడయినను, దైవము = అదృష్టము, ఆతేజమున్ = ఆమహిమమును, తప్పన్ + చూచునెడన్ = వేఱు విధముగా నాలోచించినట్లయిన, త్రిమ్మరి = మరలి, కోల్పడున్ = పోఁగొట్టుకొన్నవాఁడగును, ఎట్లనన్ = ఉదాహరణ మేమనఁగా- మహారాజకుమారుఁడు = దశరథుఁడను మహారాజుకొమరుఁడైన, రఘురాముఁడు = శ్రీరామమూర్తి, కాల్నడన్ = బండి, వాహ

నడువలేక = కాళ్లతో నడిచి, వనికిన్ = వనమునకు, పోయి = వెళ్లి, కాయలున్, ఆకులున్ = కాయలును, ఆకులును, భోజనము + ఐ = ఆహారముగాఁగొన్నవాఁడై, తగన్ = తగినట్లు, మున్ను = పూర్వకాలమున, చరింపఁడె = సంచరింపలేదా.

తాత్పర్యము దైవముతప్పఁజూచినపుడు, ఎంతగొప్పవాఁడయినను దనగొప్పతనము చెడి తిరుగును. పూర్వము శ్రీరామునంతటి మహానుభావుఁడును, రాజ్యముపోయి, యడవిలో నాకులు, గాయలుదిని యిబ్బందిపడుట దైవమర్విపాక ముననేకదా.

చ. ఉరుకరుణాయుతుండుసమయోచితమాత్మఁదలంచియుగ్రవా
క్పరుషతఁజూపినన్ ఫలముగల్గుట తథ్యముగాదెయంబుదం
బుఱిమినయంతనే కురియకుండునెవర్షము లోకరక్షణ
స్థిరతరపౌరుషంబున నశేషజనంబు లెఱుంగభాస్కరా. ౧౪

టీక. భాస్కరా! ఉరు + కరుణా + యుతుండు = విశేష, దయతోఁగూడినవాఁడు (దాత), సమయ + ఉచితము = ఆయాసమయములకు, సరిపడిన విషయమును, ఆత్మన్ = తనలో, తలంచి = ఎంచి, ఉగ్రవాక్పరుషతన్-ఉగ్ర = భయంకరమైన, వాక్ = మాటలయొక్క, పరుషతన్ = కఠినత్వమును, జూపినన్ = చూపించినను, ఫలముకల్గుట = లాభముదొరకుట, తథ్యము, గాదె = నిశ్చయమేయగును. ఉదాహరణము- అంబుదంబు = మేఘము, అశేషజనంబులు-న- శేష-జనంబులు = అందఱును, ఎఱుంగన్ = తెలియునట్లు, లోకరక్షణస్థిరతరపౌరుషంబు

నల్-లోక=ప్రపంచమును, రక్షణ=రక్షించుటయందు, స్థిర తర=మిక్కిలిస్థిరతరమైన, పౌరుషంబున్=పూనికతో, ఉఱుమి నయంతనే=గర్జించిన వెంటనే, వర్షము, కురియక, ఉండునే= వానకురియకయూరకుండునా.

తాత్పర్యము. అర్థులయందు దయగలదాత ఏదోతొం దరలోనుండి యొకప్పుడు కోపముతోఁబరుషభాషణములాడినను అర్థులకోరికదీఱ ధనమీయకమానఁడు, మేఘము బడబడగుండె లవియునట్లుఱిమి వర్షముకురియకుండఁబోవుట లేదుగదా.

ఉ. ఉరుగుణవంతుఁడొడ్లు తనకొండపకారము సేయునప్పుడుం
బరహితమే యొనర్చునొకపట్టున నైనను గీడుఁజేయఁగాఁ
నెఱుఁగఁడు; నిక్కమేకద! యదెట్లనఁగవ్వముఁబట్టియెంతయుం
దరువఁగఁజొచ్చినంబెరుఁగుతాలిమినీయదెవెన్నభాస్కరా.

టీక. భాస్కరా! ఉరు, గుణవంతుఁడు= అధిక, సుగుణములుగలవాఁడు, ఒడ్లు=ఇతరజనులు, తనకున్=తనవిషయమై, ఒండు=ఒక్క, అపకారము=హానిని, చేయునప్పుడున్= చేయఁబోయినప్పుడును, పర, హితము, ఏ=పరోపకారమునే, ఒనర్చున్ =కావించును (కాని) ఒకపట్టున, నైనన్=ఏసమయములోనైనను, కీడు= చెఱుపు, చేయఁగాన్= చేయుటకొఱకు, ఎఱుఁగఁడు=తలంపఁబోఁడు, నిక్కమేగద=ఇదిసత్యము. ఉదాహరణము- అది, ఎట్లనన్=ఉదాహరణ మెట్లనఁగా, పెరుఁగు=దధి, కవ్వమున్ + పట్టి=కవ్వముపట్టుకొని, ఎంత యున్=మిక్కిలిగా, తరువన్ + చొచ్చినన్=చిలుకుటకు

బ్రారంభినను, తాలిమిన్ = మిక్కిలియోపికతో, వెన్నన్ = నవ
నీతమును, ఈయదె = ఇచ్చుట లేదా.

తాత్పర్యము. మంచివారు, తనకితరులపకారము చేయఁ
బోయినను వారికుపకారమేచేయునుగాని ప్రత్యపకారము
చేయఁబోరు. ఎట్లనఁగా :- పెరుఁగును గుండలోఁబోసికవ్వము
తో మథించి బాధించినను వారికి వెన్ననిచ్చుటమానిరదా. ఎవరి
గుణము వారుమానరు.

చ. ఉరుబలశాలినంచుఁ దననొల్లనియన్యపతివ్రతాంగనా
సురతముఁగోరెనేని గడనుమ్మది భూతికిఁబ్రాణహానియౌ;
శిరములుగూల రాఘవునిచే దశకంఠుఁడు ద్రుంగిపోఁడే
యెఱుఁగక సీతకాసపడియిష్టుల భృత్యులఁగూడిభాస్కరా.

టీక. భాస్కరా! ఉరుబలశాలిని = నేనుఅధికబలవంతుఁ
డను, అంచును = అనుకొని, (ఎవ్వఁడుగాని) తనున్-ఒల్లని =
తన్నుసమ్మతింపని, అన్యపతివ్రతాంగనాసురతమున్-అన్య =
ఇతరునిభార్యయైన, పతివ్రతా + అంగనా = పెనిమిటినే దైవ
ముగానమ్మికొని యాతనినే పూజించుస్త్రీయొక్క, సురత
మున్ = కలయికను, కోరెన్ + ఏని = ఆశపడునట్లయిన, అది =
ఆయాశ, భూతికిన్ = తనబలము, ధనము మొదలగు నైశ్వర్య
మునకు, కడ = అంతకాలము, సుమ్ము = అగునుచుమా, ఐశ్వ
ర్యముపోవుటేకాదు, ప్రాణహాని = ప్రాణ = ఉసురులుగూడఁ
బోవును. ఉదాహరణము- దశకంఠుఁడు = పదితలలుగల రావ
ణుఁడు, ఎఱుఁగక = అజ్ఞానముచే, సీతకున్ = సీతాదేవికొఱకు,

ఆసపడి=కామించి, ఇష్టులన్=స్నేహితులను, భృత్యులన్= సేవకులను, కూడి=కలసికొని, రాఘవునిచేన్=శ్రీరాముని చేత, శిరములు, కూలన్=తలలునఱకఁబడి, త్రుంగిపోఁడే= నశించిపోలేదా.

తాత్పర్యము. బలాదిగర్వముచేఁ బ్రతివతలగు పరకాంతను గోరినవానికి సర్వసంపన్నాశనమే కాదు, ప్రాణహానియునగును. పతివ్రతయగు సీతనుగామించిన రావణుఁడు రామునిచేఁ బుత్రమిత్రపరివారసహితుఁడై మరణింపలేదా.

ఉ. ఊరక వచ్చుఁ బాటుపడకుండిన నైన ఫలంబదృష్టమే
పారఁగఁ గల్గువానికిఁ బ్రయాసము నొందిన దేవదానవుల్
వారలటుండఁగా నడుమవచ్చిన శౌరికిఁగల్గఁగాదె శృం
గారపుఁబ్రోవులక్ష్మియును గౌస్తుభరత్నము రెండుభాస్కరా.

టీక. భాస్కరా! అదృష్టము=దైవము, (కనఁబడకుండ వచ్చులాభము) ఏపారఁగన్=బాగుగ, కల్గువానికిన్=ఉండిన వానికి, ఫలంబు=లాభము, పాటుపడక+ఉండినన్+ఐన= కష్టపడక, యుండినప్పుడుఁగూడ, ఊరక=ఏమియుఁజేయక, తనంతనే, వచ్చున్=కలుగును. ఉదాహరణము- ప్రయాసమున్=శ్రమను, ఒందిన=పొందినట్టి, దేవ+దానవుల్= దేవతలును, రాక్షసులును, వారు=తమరు, అటులు+ ఉండన్+కాన్=ఊరకయేమియులాభమును పొందకపోఁగా, నడుమ, వచ్చినశౌరికిన్=తేరకాఁడుగా, వచ్చియున్న విష్ణుదేవునకు, శృంగారపున్+ప్రోవు=సౌందర్య, రాశి, యైన, లక్ష్మి

యును=లక్ష్మీదేవియును, కౌస్తుభరత్నముం=కౌస్తుభమను మణియును, రెంటను=కల్గెన్ + కాదె=దొరకెనుగదా.

తాత్పర్యము. అదృష్టవంతునకు, మేలు, తనంతటఁదానే కలుగును. ఏమియు యత్నముచేయ నక్కఱలేదు. పర్వతము మోచితెచ్చి సముద్రమథనముచేసి శ్రమపడిన దేవదానవు లట్లుండఁగా, సుమమవచ్చిన విష్ణుదేవునకు లక్ష్మియు, కౌస్తుభ మాణిక్యమును జేపడినవి.

ఉ. ఊరకసజ్జనుం డొదిఁగి యుండిననైన దురాత్మకుండు ని
ష్కారణమోర్వలేక యపకారముచేయుట వానివిద్యగా;
చీరెలు నూఱుటంకములు చేసెడివైనను బెట్టె నుండఁగాఁ
జేరిచినింగిపోఁ గొఱుకఁ జిమ్మట కేమిఫలంబు భాస్కరా.

టీక. భాస్కరా! దురాత్మకుండు=(దుర్ + ఆత్మ) దుష్టబుద్ధిగలవాఁడు, సజ్జనుండు=సత్పురుషుఁడు, ఒదిగి + ఉండినన్ + ఐనన్=ఒకరిజోలికిఁబోక, యుండినప్పటికి, ఊరక= ఆదుర్జనుఁడు, పనిలేకయే, ఓర్వలేక=సజ్జనత్వమును సహింపలేక, అపకారము=హాని, చేయుట=ఒనర్చుట, వాని + విద్య + కా=ఆదుర్జనుని, స్వభావముగదా. (అతఁడు చదివిన చదువు పరులకపకారము చేయుటయే). ఉదాహరణము- నూఱుటంకము-చేసెడివైనను=నూఱులకొలఁది టంకముల వెల గలవియైనను, (టంకమను నాణెము, రూపాయలో మూఁడవ వంతు?) పెట్టెను + ఉండఁగాన్=పెట్టెలో, నున్నప్పుడు, చేరి= ఆపెట్టెలోఁదూఱి, చినింగి + పోన్=చిల్లులు, పడునట్లు, చీర

లు=వస్త్రములను, కొఱుకు-చిమ్మటకున్=కొట్టివేయుపట్టి, చిమ్మటయను పురుగునకు, కేమిఫలంబు=ఏమియునులాభము లేదు. (కానియదిచానివిద్య).

తాత్పర్యము. సజ్జనుఁడు, వినయవర్తనుఁడై, యొకరి జోలికిఁబోకపోయినను దుర్జనుఁడు వానినిజూచి యోర్వలేక యపకారముచేయుట యతెనినైజగుణము. పెట్టెలోఁబడియున్న విలువగలవస్త్రములను కొట్టివేయుచిమ్మెటకు పైదుర్జనుఁడుప మింపఁదగినవాఁడు.

ఉ. ఎట్టుగఁబాటుపడ్డ నొకయించుకప్రాప్తములేక వస్తువుల్
పట్టుపడంగనేర నిబద్ధి సురావళిఁగూడి రాక్షసుల్
గట్టుపెకల్చి పాల్కడలి గవ్వముచేసి మథించి రంతయున్
వెట్టియెకాక యేమనుభవించిరి వారమృతంబుభాస్కరా. ౧౯

టీక. భాస్కరా! ఎట్టుగన్=ఎట్టివిధముగా, పాటు+పడ్డన్=శ్రమపడినను, (కొందఱకు) ఒక, యించుక=మిక్కిలి, కొంచెమైనను, ప్రాప్తము, లేక=అదృష్టములేని కారణమున, వస్తువుల్=పదార్థములు పట్టువడంగన్+నేరవు=దొరకుఁబడవు. (లభింపవు) నిబద్ధి=నిశ్చయము. ఉదాహరణము- సురావళిన్=దేవతలను, కూడి=చేరి, రాక్షసుల్=దానవులు, గట్టు-పెకల్చి=పర్వతమును, పెకలించి, పాల్కడలిన్=క్షీరసాగరమునందు, కవ్వముచేసి=మంథరపర్వతమును, కవ్వమువలె నుపయోగించి, మథించిరి=త్రచ్చిరి, అంతయున్=అదయెల్ల, వెట్టియె, కాక=లాభములేనిపనిపాటేగాని, వారు=ఆదానవులు,

అమృతంబు=సుధారసమును, ఏమి, అనుభవించిరి=ఏమైన, పొందఁగలిగినారా, లేదు.

తాత్పర్యము. అదృష్టహీనులెంత శ్రమపడి పనిచేసినను లాభమును బొందఁజాలరు. దేవతలతోపాటు కష్టపడి సముద్రముమథించిన రాక్షసులకుఁ బడినపాటెల్ల వ్యర్థమయ్యెనేకాని ఫలించినదా. అమృతము దేవతలనుభవించిరి. వీరికివారితో వైరముకల్గినది.

చ. ఎడపక దుర్జనుండొరుల కెంతయుఁ గీడొనరించుఁగాని యే
యెడలనుమేలు సేయఁడొకయించుకయైనను జీడపుర్వుదాఁ
జెడఁదిను నింతెకాని పుడిసెండు జలంబిడి పెంపనేర్చునే
పొడవగుచున్న పుష్పఫలభూరుహమొక్కటినైనభాస్కరా.

టీక. భాస్కరా! దుర్జనుండు=దుష్టుఁడు, ఎడపక=విడువక, ఒరులకున్=ఇతరులకు, ఎంతయున్=మిక్కిలి, కీడు=అపకారము, ఒనరించున్=చేయును, కాని, ఏయెడలను=ఏసమయమందైనను, ఒక, ఇంచుక, ఐనన్=ఎంత, స్వల్పముగా, నైనను, మేలు, చేయఁడు=ఉపకారము చేయఁడు. ఉదాహరణము. చీడపుర్వు=సస్యమునకుఁబట్టె విదక్రిమి, తాన్=తాను, చెడన్=నాశనమగునట్లు, తినున్=భక్షించును, ఇంత+ఎ+కాక=అట్లు, చెడన్, తినునేకాని, పుడిసెండు=ముకిచిపట్టినచేరెఁడు, జలంబు=నీరు, ఇడి=పోసి, పొడవు+అగుచు+ఉన్న=పెరుఁగుచున్నట్టు, పుష్ప, ఫల, భూరుహమున్=పువ్వులుపూచి, పండ్లుకాచెడు (భూ+రుహ)

వృక్షమును, ఒక్కటిన్ + ఐనన్ = ఒక్కచెట్టునైనను, పెంపనేర్చును + ఏ = వృద్ధిపొందింపఁగలదా.

తాత్పర్యము. దుష్టుండు పరులకుఁ గీడుచేయునే కాని మేలుచేయఁజాలఁడు. చీడపుర్వుఁగుచేరి చెట్టుచెఱచునే కాని, కొంచెము నీళ్లుపోసి యేచెట్టునైనను బెంపఁగలదా.

ఉ. ఎడ్డమనుష్యుఁ డేమెఱుఁగు నెన్నిదినంబులు గూడియుండినన్
దొడ్డగుణాఢ్యునందుఁ గలతోరపువర్తనలెల్లఁ బ్రజ్ఞ నే
ర్పడ్డవివేకిరీతి; రుచిపాకము నాలుకగా కెఱుంగునే
తెడ్డదికూరలోఁ గలయఁ ద్రిమ్మరుచుండిననైన భాస్కరా.

టీక. భాస్కరా! ఎన్నిదినంబులు = ఎంతకాలము, కూడి = స్నేహముచేసి, ఉండినన్ = ఉన్నప్పటికి, దొడ్డ, గుణాఢ్యునందున్ = విశేషమైన, సుగుణములుగల యొక్కపురుషుని యందలి, తోరపు = గొప్పవగు (కొనియాడఁదగిన) వర్తనలు = సద్గుణములను, ప్రజ్ఞ = బుద్ధివిశేషముచేత, ఏర్పడ్డ = ప్రసిద్ధికెక్కిన వివేకిరీతిన్ = బుద్ధిశాలి తెలిసికొనువిధముగా, ఎడ్డమనుష్యుఁడు = మూర్ఖజనుఁడు, ఏమి + ఎఱుఁగున్ = ఏమి తెలిసికొనఁగలఁడు. ఉదాహరణము- కూరలలోన్ = వండిన శాకపదార్థములలోపల, కలయన్ = కలియఁబెట్టుచు, త్రిమ్మరుచున్ + ఉండినను = తిరుగుచున్నప్పటికిని, రుచిపాకము = ఆ కూరలయందలి పక్వపురుచిని, నాలుక, కాక = నాలుక తెలిసికొనునుగాని తెడ్డు + అది = ఆతెడ్డు (కఱ్ఱతోఁ జేసిన గరిటె) ఎఱుంగునే = తెలిసికొనఁగలదా.

తాత్పర్యము. సజ్జనునితో నెన్నిదినములు తిరిగినను వాని సుగుణములు వివేకికిఁ దెలిసినట్లు మూర్ఖునకుఁ దెలియవు. రుచి గలవంటపదార్థములలో నెల్లప్పుడు కలిసి తిరుగుచున్నను నాలుక తెలిసికొనినట్లు వానిరుచిని త్రెడ్డు తెలిసికొనలేదు.

ఉ. ఎప్పుడదృష్టతామహిమ యించుక పాటిలు నప్పుడింపుసొం
పొప్పుచునుండుఁగాక యది యొప్పనిపిమ్మట రూపుమాయుఁగా;
నిప్పునఁ గంటియున్న యతినిర్మలినాగ్ని గురుప్రకాశముల్
దప్పిన నట్టిబొగ్గునకుఁ దానలు పెంతయుఁ బుట్టు భాస్కరా. ౨౨

టీక. ఎవ్వనికైనను, ఓభాస్కరా! ఎప్పుడు=ఏకాలమున, అదృష్టతా మహిమ=దైవవిలాసము, ఇంచుక=కొంచెము, పాటిలుఁ=సంఘటిల్లునో, అప్పుడు=ఆకాలమున, (అతఁడు) ఇంపు, సొంపు, ఒప్పుచుఁ, ఉండున్=అందము, చందము, గలిగి, యుండును, కాక=కాని, అది=ఆదైవవిలాసము, ఒప్పనిపిమ్మటఁ=ప్రకటముగా నుండనిసమయములో, అది=ఆయందచందములకలిమి, రూపు, మాయుఁ=ఆకార, శూన్యమగును, (చెడును) కా=కదా, ఉదాహరణము- బొగ్గునకుఁ=అంగారమునకు, (మసిబొగ్గునకు) నిప్పునన్=అగ్నియందు, అంటియున్న=కలసియుండిన, అతినిర్మల=మిగుల, తేటయైన (నిర్ + మలిన, కలంకములేని) అగ్ని=అగ్నిహోత్రునియొక్క, గురుప్రకాశముల్=గొప్పకాంతులు, తప్పినఁ=తొలఁగిపోయినప్పుడు, అట్టిబొగ్గునకున్=ఆనిప్పువిడిచిన బొగ్గునకు, తాన్, నలుపు=నల్లఁదనము, ఎంతయున్=విశేషముగా, పుట్టుఁ=పొడమును.

తాత్పర్యము. ఎవ్వరికైనను భాగ్యరేఖ బయలుపడిన ప్పుడెంతటి కళయైనను గలిగియుండును. అదితప్పిననాడు, పూర్వాకారముండదు. కళాహీనమగును. బొగ్గునకు నిప్పున్నంతనేపే కాంతియుండును. నిప్పు చల్లారినపిమ్మట నల్లబడిపోవును గదా.

ఉ. ఏగతిఁబాటుపడ్డఁ గలదే భువి నల్పునకున్ సమగ్రతా
భోగము భాగ్యరేఖగల పుణ్యునకుంబలె; భూరిసత్త్వసం
యోగమదేభ కుంభయుగళోత్థితమాంసము నక్కకూనకే
లాగుఘటించు సింహము దలంచినఁ జేకుఱుఁగాని భాస్కరా. 23

టీక. అల్పునకున్=దరిద్రునకు, ఏగతిన్=విధముగా, పాటుపడ్డన్=శ్రమపడినను, భువిన్=లోకములో, సమగ్రతా + భోగము=పరిపూర్ణమైన యైశ్వర్యము, భాగ్యరేఖ గలపుణ్యునకున్-బలెన్=అదృష్టపుగీటుగల పుణ్యశాలికిఁగలిగి నట్లు, కలదే=కలుగుచున్నదా. ఉదాహరణము- భూరి + సత్త్వ + సంయోగ + మద + ఇభ + కుంభ + యుగళ + ఉత్థిత + మాంసము=ఎక్కువ + బలము యొక్క + కూడిక గల + మదించిన + ఏనుఁగుయొక్క, కుంభస్థలములు + రెంటి నుండి + పుట్టిన + పలలము, సింహము=మృగరాజు, తలంచి నన్=తలఁచుకొన్న యెడల, చేకుఱున్ + కాని=దొరకునుగాని, నక్కకూనకున్=చిన్ననక్కపిల్లకున్, ఏలాగు=ఏవిధముగా, ఘటించున్=దొరకును.

తాత్పర్యము. అదృష్టవంతునకు దొరకినట్లు దురదృష్ట

వంతునకు మహాభోగము లనుభవింపదొరకునా. మదపుటేనుఁగు గండస్థలమునందలి మాంసము సింహమునకు దొరకునుగాని నక్కపిల్లకుదొరకునా.

ఉ. ఏడననర్హుఁ డుండు నటకేగు ననర్హుఁ డు నర్హుఁ డున్నచోఁ
జూడఁగనొల్లఁ డెట్ల నశుద్ధగుణస్థితి నీఁగపూయముం
గూడినపుంటిపై నిలువఁ గోరినయట్టులు నిల్వనేర్చునే
నూడిదపెట్టువెన్నునుదుటిచొక్కపుఁగస్తురిమీఁదభాస్కరా. ౨౮

టీక. భాస్కరా! అనర్హుఁ డు (న + అర్హుఁ డు) = తగని వాఁడు, ఏడ = ఎక్కడ, ఉండున్ = ఉన్నాఁడో, అటకున్ = అక్కడకు, అనర్హుఁ డు = తగనివాఁడు, ఏగున్ = పోయిచేరును, కాని, అర్హుఁ డు = యోగ్యుఁడు, ఉన్నచోన్ = ఉండినతావును, చూడన్ + కన్ = చూచుటకు, ఒల్లఁ డు = ఇష్టపడఁడు. ఉదాహరణము- ఎట్లు + అనన్ = ఎట్టులనఁగా, ఈఁగ = మక్షిక, అశుద్ధగుణస్థితిన్ = దుస్స్వభావముచే, పూయమున్ + కూడిన = రసితోఁగూడుకొనిన, పుంటిపైన్ = వ్రణముమీఁద, నిలువన్ = నిల్చుటకు, కోరిన + అట్టులు = ఇచ్ఛపడినట్లు, నూడిద = సొగసు-పెట్టు = కలిగించుటకై పెట్టిన, నెఱ + నుదుటి = నొసటిపై నున్న, చొక్కపు = మంచి, కస్తురి, మీఁదన్ = కస్తూరిపైని, నిల్వన్ + నేర్చునే = నిల్చుటకిష్టపడునా.

తాత్పర్యము. ఎవ్వనికిఁ దగినవానియొద్ద, వాఁడు చేరును గాని మఱియొక్కరితోఁ జేరఁడు. ఈఁగపుంటిమీఁద వ్రాలునట్లు, నుదుటికస్తురిబొట్టుపై నిలుచుటకిష్టపడునా.

ఉ. ఏలసమస్తవిద్యల నొకించుక భాగ్యముగల్గి యుండినం
జాలుననేకమార్గములు సన్నుతికెక్కనదెట్లొకో యనన్
ఱాలకు నేషవిద్యలు తిరంబుగ దేవరరూపు చేసినన్
వ్రాలినమస్కరించి ప్రసవంబులు పెట్టరెమీఁదభాస్కరా. ౨౫

టీక. భాస్కరా! సన్నుతికిన్ + ఎక్కన్ = స్తోత్రపాత్రుఁ డగుటకు, సమస్తవిద్యలన్ = ఎల్లచదువులతోను, ఏల = ఏమి ప్రయోజనము, (ఏవిద్యయునక్కఱలేదు) భాగ్యము = అదృష్ట ము, కల్గియుండినన్ = కలిగియున్నట్లయిన, అనేకమార్గములు = పలుపోకలుపోవుట, చాలున్ = అక్కఱలేదు, అది + ఎట్లు + ఒకో + అనన్ = ఉదాహరణమేమియంటిరా, ఱాలకున్ = శిల లకు, దేవరరూపు = దేవతాస్వరూపములుగా, చేసినన్ = చెక్కి మలిచినట్లయిన, వ్రాలి = నేలసాష్టాంగముగాఁబడి, నమస్క రించి = మ్రొక్కి, ప్రసవంబులు = పుష్పము, పెట్టరె = మీఁద వేసిపూజచేయుటలేదా, విద్యలు = చదువులు, ఏడ = ఎక్కడవి, అఱాలేమిచదువుకొన్నవి, అదృష్టమే ప్రధానముగాని చదు వులుగావు.

తాత్పర్యము. ఏమూలనో భాగ్యరేఖయున్నచోఁ బ్ర సిద్ధుఁడగుటకు వానికిఁజాలును. పెక్కుశాస్త్రదులు చదువుకొని యుద్యోగములు చేయనక్కఱలేదు. ఱాతినిదెచ్చి దేవతారూ పముగాఁజెక్కిన సమస్తజనులువానికి మ్రొక్కుచున్నారు. పూ జించుచున్నారు. అదియేమిచదువుకొన్నది.

ఉ. ఒక్కఁడె చాలునిశ్చలబలోన్నతుఁ డెంతటి కార్యమైనఁ దాఁ
జక్కనొనర్పఁ గౌరవు లసంఖ్యులు పట్టిన ధేనుకోటులం
జిక్కఁగనీక తత్ప్రబలసేన ననేకశిలీముఖంబులన్
మొక్కపడంగఁ జేసితుదముట్టఁడెయొక్కకిరీటిభాస్కరా. ౨౬

టీక. భాస్కరా! నిశ్చల + బల + ఉన్నతుఁడు = చలనములేని, శక్తిచేత, అతిశయించినవాఁడు, తాన్ = తాను, ఎంతటి కార్యము + ఐనన్ = ఎంతటి ఘన కార్యమైనను, చక్కన్ = లెస్సగా, ఒనర్పన్ = సాధించుటకు, ఒక్కఁడు + ఎ = ఒక్కఁడే, చాలున్ = సమర్థుఁడగును. ఉదాహరణము- అసంఖ్యులు = లెక్క పెట్టుటకు వీలులేనియందఱు, కౌరవులు = కురువంశులయిన దుర్యోధనాదులు, పట్టిన = పట్టుకొనిన, ధేను + కోటులన్ = ఆలమందలను, చిక్కగన్ + ఈక = తోలుకొని, పోనీయక తత్ప్రబలసేనన్-తత్ = ఆకౌరవుల, సేనన్ = సైన్యమును, అనేక + శిలీముఖంబులన్ = విశేష-బాణముల చేత, ఒక్క కిరీటి = అర్జునుఁడొక్కఁడే, (కిరీటి = క్రీడి) మొక్క పడంగన్ + చేసి = పరాభవము నొందునట్లుచేసి, (వాఁడిచెఱిచి) తుదన్ + ముట్టఁడె = నెఱవేఱలేదా, జయించిసాధింపలేదా.

తాత్పర్యము. బలవంతుఁడొక్కఁడున్న నెంతటిగొప్ప పనినైన నెఱవేర్చును. దుర్బలులు పలువురాపనింజేయలేరు. గోగ్రహణమునకై కౌరవులనేకులువచ్చి పసులకదుపులను మరలించుకొని పోవుచున్నపుడు వారినందఱను దెరలించిగోవులను విడిపించినవాఁడు బలశాలియైన యర్జునుఁడొక్కఁడేకాదా.

క. కట్టడదప్పి తాము చెడుకార్యముఁ జేయుచునుండిరేని దోఁ
బుట్టినవారినైన విడిపోవుటకార్యము దార్మదాంధ్యముం
దొట్టిన రావణాసురునితో నెడఁబాసి విభీషణాఖ్యుఁడా
పట్టునరాముఁజేరి చిరపట్టముఁగట్టుకొనండె భాస్కరా. ౨౭

టీక. భాస్కరా! కట్టడ=హద్దు, తప్పి=మీఱి, చెడు, కార్యము=కూడని, పనిని, చేయుచున్ + ఉండిరి + ఏని= చేయుచున్నయెడల, (బుద్ధిశాలికి) తోఁబుట్టినవారిని + ఐనన్ = తోన్=కూడ, పుట్టినవారిని, కూడ (అన్నదమ్ములనయినను) విడిపోవుట = ఎడఁబాయుట, కార్యము=ఉత్తమమైన పని, (మంచిది) దార్మదాంధ్యమున్=దుర్మదసంబంధమైనది దార్మదము,దుర్గర్వముచేతనైన, అంధ్యమున్=గుడ్డితనమును, దొట్టిన=పొందిన, రావణాసురునితోన్=(రావణ + అసురుఁడు) రావణుఁడను రాక్షసుఁడైన అన్నతో, విభీషణ + ఆఖ్యుఁడు= విభీషణుఁడు, అనుపేరుగలతమ్ముఁడు, ఎడఁబాసి=వేఱుపడి, ఆపట్టునన్=ఆవెంటనే (అప్పుడే) రామున్=శ్రీరాముని, చేరి=శరణుపొంది, చిరపట్టమున్=శాశ్వతరాజ్యపట్టాభిషేకమును, కట్టుకొనండె=పొందలేదా.

తాత్పర్యము. గర్వాంధులై (చేయునది చేయఁగూడనిదికనిపెట్టలేని గర్వమనుగుడ్డితనముగలవారై) యకార్యములు చేయుచున్నతోడఁబుట్టిన వారినైనను విడిచిపెట్టిన వారికి లాభముకలుగును. రావణుఁడుచేయు దుష్కార్యమును సహింపలేక విభీషణుఁడు రామునియొద్దికిఁబోయి శాశ్వతరాజ్యమును బొందినాఁడుగదా.

ఉ. కట్టడయైనయట్టి నిజకర్మము చుట్టుచువచ్చి యేగతిం
బెట్టునొ పెట్టినట్లనుభవింపక తీఱదు కాళ్లమీఁదుగాఁ
గిట్టక వ్రేలుఁడంచుఁ దలక్రిందుగఁ గట్టిరెయెవ్వరైననా
చెట్టున గబ్బిలంబులకుఁ జేరినకర్మముగాక భాస్కరా. ౨౮

టీక. భాస్కరా! కట్టడయైనయట్టి=విధియేర్పాటువలననైన, నిజకర్మము=తనపూర్వకర్మము, చుట్టుచున్=అలుముకొని, వచ్చి=ఏగతిన్=ఏపాట్లు, పెట్టునో=అనుభవింప నియమించునో, పెట్టినట్లు=నియమించునట్లు, అనుభవింపక=కర్మానుభవమునుబొందక, తీఱదు=నశింపదు. ఉదాహరము- ఎవ్వరైనన్=ఎవ్వరుగాని, గబ్బిలంబులకున్=గబ్బిలములనుజంతువులకు, కిట్టక=దానిపైనసూయచేత, కాళ్లు=పాదములు, మీఁదుగాన్=మీదికిపెట్టుకొని, తలక్రిందుగన్=క్రిందికిఁ దలపెట్టుకొని, వ్రేలుఁడు=వ్రేలాడుఁడు, అంచు=అని, ఆచెట్టునన్=వృక్షముమీఁద, కట్టిరే=కట్టిపెట్టినారా, లేదు, మఱియేల-వ్రేలాడుచున్నవి, చేరినకర్మముగాక=కూడుకొన్న పూర్వజన్మకృత్యముయొక్క ఫలముగాని వేరుకాదు.

తాత్పర్యము. తొల్లిజన్మములోఁ దానుజేసికొన్నకర్మమె యిప్పుడు చుట్టబెట్టి యనుభవింపఁ జేయుచుండును. గబ్బిలములమీఁద నెవ్వరికైనఁ గోపమువచ్చి చెట్టునకుఁ దలక్రిందుగా వ్రేలాడఁదీసినారా. దానికర్మవశమున నది యట్లు వ్రేలాడుచున్నది.

ఉ. కట్టడలేనికాలమునఁ గాదుశుభం బొరులెంతవారు చే
పట్టిననైన మర్త్యునకు భాగ్యమురాదనుటెల్లఁ గల్లకా
దెట్టనిపల్కినన్ దశరథేశవసిష్ఠులు రామమూర్తికిం
బట్టముకట్టఁగోరి రదిపాయక చేకుఱెనోటుభాస్కరా. ౭౯

టీక. భాస్కరా! మర్త్యునకున్ = జనునకు, కట్టడ, లేని కాలమునన్ = భగవంతుని యేర్పాటులేని సమయమున, ఒరులు = భగవంతునికంటెనితరులు, ఎంతవారు = ఎంతగొప్ప వారు, చేపట్టినన్ + ఐనన్ = పూనుకొనినప్పటికిని, శుభంబు = మేలు, కాదు = కలుగదు, భాగ్యము రాదు = ఐశ్వర్యముకలు గదు, అనుట = ఇట్లని చెప్పుట, ఎల్లన్ = అంతయును, కల్ల = అ సత్యము, కాదు = కానేరదు. ఉదాహరణము- ఎట్టు + అని + పల్కినన్ = ఎట్టులని యడిగితిరా, వినుండు, రామమూర్తికిన్ = శ్రీరామచంద్రునకు, దశరథేశవసిష్ఠులు = దశరథరాజును, వసి ష్ఠమహామునియు, పట్టమున్ + కట్టన్ + కోరిరి = రాజ్యాభిషే కము చేయనెంచిరి, అది = ఆయెంచుట, పాయక = విఘ్నము కాక, చేకుఱెన్ + ఓటు = లభించినదా.

తాత్పర్యము. నరులకు దైవబలము లేనిసమయములో నెంతటిఘనులు వానిపక్షముపూనుకొన్నను గార్యసానుకూలము గాదు. ఫలముచేకూరదు. శ్రీరాముని విధియట్లుండుటచేతనే గదా, దశరథమహారాజును, వసిష్ఠమహామునియుఁ బూను కొన్నను, పట్టాభిషేకమును జేయఁలేకపోయిరి.

ఉ. కానకచేరఁబోలదతికర్ముఁడు సమ్మికలెన్ని చేసినం
దానదినమ్మి వానికడదాయఁగఁ బోయినహాని వచ్చున

చొచ్చినదియెట్లనం గొఱకుఁజూపుచు నొడ్డినబోనుమేలుగాఁ
బోనని కానకాసపడి పోవుచుఁగూలదె కొక్కు భాస్కరా. 30

టీక. భాస్కరా! అతి + కర్ముఁడు = (మర్యాదను) అతిక్రమించిన పనులుచేయువాఁడు, ఎన్నినమ్మికలు చేసినన్ = ఎన్నివిధములైన, విశ్వాసపుమాటలాడినను, కానక = వెనుకముందు లయోజింపక, చేరన్ + పోలదు = వానితోఁ గూడియుండుట తగదు, తాన్ = తాను, అది = ఆనమ్మకపుమాటలను, నమ్మి = నిజమనుకొని, వానికడన్ = ఆయతికర్మునిదగ్గఱ, దాయన్-కన్-పోయినను = చేరఁగాఁబోయినయెడల, ఎచ్చోటన్ = ఎందయినను, హాని = ఎగ్గు, వచ్చున్ = కలుగును. ఉదాహరణము. అది, ఎట్లు, అనన్-కొఱకున్ = ఆహారపదార్థము, చూపుచున్ = కనఁబడునట్లుచేయుచున్, బోనున్ = ఎలుకబోనును, ఒడ్డినన్ = ముట్టుకొనినంతనెపడునట్లుమొగిచివిడిచినంతట, మేలు = మంచి, కాన్ + పోన్ + అని-కాఁబోవునని, కానక = ఆలోచింపక, ఆసపడి = ఎఱకై లోభించి, పోవుచున్ = వెళ్లియువెళ్లఁగానె, కొక్కు = ఎలుకలలోఁ బెద్దజాతి (పందికొక్కు) కూలదె = చిక్కుకొని నశింపదా.

తాత్పర్యము. దుర్జనుఁడు పరులనువలలోఁ బడవైచుకొనుటకై యెన్నో మంచి మంచి మాటలాడి బాసచేయును. ఆవానినినమ్మినవానికి మోసమువచ్చును. బోనులో వ్రేలఁగట్టిన రుచ్యపదార్థము మనసారఁదినుటకై మోహించిబోనులోఁ జొచ్చినపందికొక్కునకు, కీడు గల్గినదా మానినదా.

ఉ. కాని ప్రయోజనంబు సమకట్టదు తాభువినెంతవిద్యవాఁ
డైనను దొడ్డరాజు కొడుకైన నదెట్లు మహేశుపట్టి వి
ద్యానిధి సర్వవిద్యలకుఁదానె గురుండు వినాయకుండు దాఁ
నేనుఁగురీతి నుండియు నదేమిటి కాడఁడు పెండ్లి భాస్కరా. 30

టీక. భాస్కరా! భువిన్ = లోకములో, తాన్ = తాను, (ఒకఁడు) ఎంతవిద్యవాఁడు + ఐనను = ఎంతటిగొప్పచదువు చదువుకొనినవాఁడైనను, దొడ్డరాజుకొడుకు + ఐనను = మహారాజుపుత్రుఁడైనను, కాని + ప్రయోజనంబు = కాఁగూడని, కార్యము, సమకట్టదు = అగుటలేదు, (కాదు) అది + ఎట్లు = ఉదాహరణమెట్లనఁగా-మహేశుపట్టి = సదాశివుని కుమారుఁడు, విద్యానిధి = చదువుల వేలుపు, సర్వవిద్యలకున్ = అన్ని శాస్త్రములకున్, తానె = తానొక్కఁడే, గురుఁడు = ఉపాధ్యాయుఁడు, అయిన, వినాయకుండు = విఘ్నేశ్వరుఁడు, తాన్ = ఆతఁడు, ఏనుఁగురీతిన్ = అడ్డులేకుండ, ఏనుఁగువలె ఉండినన్ = సంచరించుచుండినను, పెండ్లిన్ = వివాహమును, అది + ఏమిటికి = ఏకారణముచేత, ఆడఁడు = చేసికొనఁడు, కాని ప్రయోజన మగుటనే.

తాత్పర్యము. మనుజుఁడు తానెంతవిద్యావంతుఁడుగాని, దొడ్డరాజుకుమారుఁడైనను గాని, అతనికిఁగాని ప్రయోజనము కానేకాదు. విద్యాధికుఁడును మహాదేవుఁడగు శివునికుమారుఁడునైన విఘ్నేశ్వరుఁడు పెండ్లి యేల చేసికొన్నాఁడుకాఁడు. ఆ ప్రయోజనమతనికిఁగానిది.

ఉ. కామితవస్తుసంపదలు గల్గుఫలం బొరు లాసపడ్డచో
నేమియుఁ బెట్టఁడేని సిరి యేటికి నిష్ఫల ముస్నఁ బోయినన్
బ్రామికపడ్డలోకులకుఁ బండఁగ నేమది యెండిపోవఁగా
నేమిఫలంబు చేఁదు విడదెన్నఁటికైన ముసిండిభాస్కరా. 33

టీక. భాస్కరా! ఒరులు = ఇతరులు, ఆసపడ్డచోన్ = కోరినపుడు, ఏమియున్ = కొంచెమైనను, పెట్టఁడు + ఏని = ఇయ్యనివాఁడైనచో, కామితవస్తుసంపదలు, కామిత = కోరిన, వస్తు = పదార్థములయొక్క, సంపదలు = కలిమి, కల్గుఫలంబు = ఉన్నందుకులాభమును, సిరి = ఐశ్వర్యమును, ఏటికి = ఏమిపనికి, ఉన్నన్ = ఆయైశ్వర్యము ఉన్నను, పోయినను = నశించినను, నిష్ఫలము = వ్యర్థము. ఉదాహరణము- ముసిండి = ముసిండి చెట్టు, బ్రామికపడ్డలోకులకున్ = భ్రమపడి కోరినజనులవిష యమై, పండఁగనేమి = పండినందున ఫలమేమి, ఎండిపోవఁ గాన్ + ఏమి = కాయలు కాయక చెట్టెండిపోయిననేమిఫలము, చేఁదు = దానిగుణమైన విషపురుచి, ఎన్నటికైనన్ = ఎంతకాల మున్నను, విడదు = విడువదు, ఏమిఫలంబు = లాభమేమియు నులేదు.

తాత్పర్యము. ఎవ్వరైన నడిగినపుడు తనకున్న యైశ్వ ర్యములోనుండి పెట్టనివాని యైశ్వర్యమున్నను నశించినను నొక్క టే. చూడఁగనే తినవలయునను బుద్ధిపుట్టించు ముసిఁడిపండ్ల లాభమేమున్నది. అది యెవ్వరికి నుపకరింపదు. ఆ చెట్టు పండిన నేమి యెండిననేమి.

ఉ. కారణ మైనకర్మములు కాక దిగంబడ వెన్నిగొందులం
దూఱిన నెంతవారలకుఁ; దొల్లి పరీక్షితు శాపభీతుఁడై
వారిధి నొప్పు నుప్పరిగపైఁ బదిలంబుగ డాఁగి యుండినం
గ్రూరభుజంగదంతహతిఁ గూలఁడె లోకు లెఱుంగ భాస్కరా.

టీక. భాస్కరా! ఎన్నిగొందులు=ఎన్నిమాటుచోటులలో, దూఱినను=దాఁగుకొనియున్నను, ఎంతవారలకైన=ఎంతటిగొప్పవారికైనను, కారణము+ఐనకర్మములు=విధిబలవంతమైకావలసినపనులు, కాక=కాకుండ, దిగంబడవు=దిగవిడువవు (మానవు). ఉదాహరణము- తొల్లి=పూర్వయుగములో, పరీక్షితు=పరీక్షిత్తు అనురాజు, శాపభీతుఁడై=మునికుమారుఁడిచ్చిన శాపమునకు భయపడి, వారిధిన్=సముద్రములో, ఒప్పు=భద్రముగానున్న, ఉప్పరిగపైన్=మేడమీఁద, పదిలంబుగ=జాగ్రత్తగా, డాఁగి=రహస్యస్థలములో, ఉండినన్=ఉన్నప్పటికిని, లోకులు+ఎఱుంగన్=అందఱును దెలిసికొనునట్లు, క్రూరభుజంగ దంతహతిన్=క్రూర=దుష్టమైన, భుజంగ=తక్షకుఁడను సర్పముయొక్క, దంత=కోఱల, హతిన్=కాటుచేత, కూలఁడె=మరణింపలేదా.

తాత్పర్యము. కాఁదలఁచినవిధిని తప్పించుకొనుటకు ఎంతవానికిని సాధ్యముగాదు. విధిబలవంతమైనది. ఎంతోభద్రముగా సముద్రములో నిల్లుకట్టుకొన్నను పరీక్షిత్తు మునిశాపము బలవంతమైనది కావున సర్పదష్టుఁడై మరణింపలేదా. ఒకముని కుమారుఁడు (పరీక్షిత్తు, తనతండ్రి మెడలోఁ దచ్చిన పామును

దగిలించినాఁడని కోపించి యీతఁడు ఏడవనాఁడు పాముకఱచి చచ్చునని మునికుమారుఁడొకఁడు శపించెను. ఆప్రకారమే యొంటిస్తంభము మేడలోనున్నను పాముకఱచినది).

చ. కులమున నక్కడక్కడ నకుంఠిత ధార్మికుఁ డొక్కఁ డొక్కఁడే
కలిగెడుఁగాక పెందఱచు గల్గఁగ నేరరు చెట్టుచెట్టునం
గలుగఁగ నేర్చునే గొడుగుకామలు చూడఁగ నాడనాడనిం
పలరఁగ నొక్కటొక్కటి నయంబునఁ జేకుఱుఁగాక భాస్కరా. ౩౮

టీక. ఓభాస్కరా! కులమునన్ = ఒక్కొక వంశములో, న + కుంఠిత + ధార్మికుఁడు = వంకర నడతలేని ధర్మాత్ముఁడు, ఒక్కఁడు + ఒక్కఁడు + ఏ = ఒక్కఁడో, యిద్దఱో, కలిగెడున్ + కాక = ఉండునుగాని, పెన్ + తఱచు = మిక్కిలి విస్తారము, కల్గఁగన్ + నేరరు, కలుగఁబోరు. ఉదాహరణము- గొడుగుకామలు = ఛత్త్రమునకుఁ బనికివచ్చు కాండములు (అనఁగా వంకరలేక తిన్ననయినవి) చూడఁగన్ = వెదకఁగా, ఆడన్ + ఆడన్ = అక్కడ, నక్కడ, ఇంపు + అలరఁగన్ = అందమైనట్లు, నయంబున = మంచిగ, ఒక్కటి, ఒక్కటి = ఒక్కటొక్కటిగ, చేకుఱుఁగాక = దొరకునుగాని, చెట్టుచెట్టునన్ = ప్రతివృక్షము మీఁదను, కలుగఁగన్ + నేర్చునే = దొరకునా.

తాత్పర్యము. ఏవంగడమునన్నైనను ఎక్కడనో నూటనాటనొక్క ధర్మాత్ముఁడుండునుగాని ప్రతియింటను గల్గుట యరుదు. గొడుగుకామలుఁ బనికివచ్చు తిన్ననికఱ్ఱలు ఎక్కడనో యొక్కొక్క చెట్టుమీఁదనుండునుగాని ప్రతిచెట్టుమీఁదను దొరకుచున్నవా.

ఉ. క్రూరమనస్కులౌ పతులఁ గొల్చి వసించిన మంచివారికిన్
వారిగుణంబె పట్టి చెడువర్తన వాటిలు మాధురీజలో
దారలు గౌతమీముఖమహానదులంబుధిఁ గూడినంతనే
క్షారముఁ జెందవే మొదలికట్టడలన్నియుఁ దప్పి భాస్కరా. 31

టీక. భాస్కరా! క్రూరమనస్కులు = చెడ్డగుణములు గలవారు, ఔ = అయిన, పతులన్ = అధికారులను, కొలిచి = సేవచేసి, వసించిన + చెడ్డవారికిన్ = నివసించు, మంచిగుణములుగలవారికిని, వారిగుణంబు + ఎ = ఆచెడ్డవారిగుణములే, పట్టి = అభ్యాసమై, చెడువర్తన = దుర్మార్గసంచారము, వాటిలున్ = సంభవించును. (అభ్యాసమగును) ఉదాహరణము- మాధురీ + జల + ఉదారలు = తీయని, నీటిచే, లోఁతైన, గౌతమీ + ముఖ + మహా + నదులు = గోదావరి, మొదలైన పెద్దనదులు, అంబుధిన్ = సముద్రమును, కూడినంతనే = చేరినంతటిలోనె, మొదటి + కట్టడలు, మొదటఁదమకున్ననీటితీపు మొదలైనగుణములు, అన్నియున్-తప్పి = అన్నియును, చెడి, క్షారముఁ = ఉప్పురుచిని, చెందవే = పొందవా (ఉప్పునీరయి పోవుటలేదా).

తాత్పర్యము. చెడ్డవారిని సేవించి వారితోఁ దిరుగు మంచివారును జెడ్డవారుగానే మాఱిపోదురు. తీయనివైనను గోదావరి మొదలగు మహానదులు సముద్రములోఁజేరి ఉప్పు నీరుగా మాఱిపోలేదా.

ఉ. గిట్టుట కేడఁ గట్టడ లిఖించునొ యచ్చటఁ గాని యొండుచోఁ
బుట్టదు చావు జానువులఁ బుస్కల నూడిచి కాశిఁ జావఁగా

ల్గట్టిన శూద్రకుం భ్రమలంగప్పుచుం దద్విధిగుట్టమై చా నా
పట్టునంగొంచు మఱ్ఱికడం బ్రాణముఁదీసెంగదయ్య భాస్కరా. 36

టీక. భాస్కరా! గిట్టుటకున్ = చచ్చుటకు, ఎడన్ = ఏచోట, కట్టడ = నియామకము, లిఖించునో = దైవము వ్రాసి పెట్టునో, అచ్చటన్ + కాని = అక్కడనే కాని, ఒండు చోటన్ = ఇంకనితరస్థలమున, చావు = మరణము, పుట్టదు = సంభవింపదు. ఉదాహరణము- శూద్రకుండు = (కాశిలో మరణింపవలెనను నిశ్చయముగల యొకరాజు), జానువులపున్కలు = జానువుల = మోంకాళ్లయందుంగల = పున్కలన్ = చిప్పలను = ఊడిచి = ఊడందీసికొని, కాశిన్ = కాశీక్షేత్రములో, చావన్ = మరణింపుటకై, కాల్గట్టిన = కాళ్లుకట్టుకొనిన, శూద్రకున్ = ఈపేరు గలరాజును, తద్విధి = అతని గ్రహచారము, భ్రమలన్ = ఆశలను, కప్పుచున్ = ఆవరింపంజేసి, గుట్టమై = విధిగుట్టమువలె వచ్చి, అపట్టునన్ = అపాళముగా, కొంచున్ = తీసికొనిపోయి, మఱ్ఱికడన్ = ఒక మఱ్ఱిచెట్టుక్రింద = ప్రాణమున్ = ఉసురును, తీసెన్ + కదయ్యా = తీసివేసినదికాదంటయ్యా.

తాత్పర్యము. నరుని కెక్కడం జావు మని విధి లిఖించెనో అక్కడికేచావం బోవునపుడు ఎట్లయినం బోయిచచ్చును. తొల్లి శూద్రకుం డనురాజు కాశిలోం జావవలయు నని నిశ్చయించుకొని, కాలున్న నెక్కడికైనం బోబుద్ధిపుట్టునుగదా యని మోంకాటిచిప్పలూడదీసికొని కాశిలోంగూర్చుండెను. ఒకప్పుడు దురుసుగుట్టము నొక్కండు తెచ్చి దీని నెక్కినవానికి గొ

ప్పబహుమాన మిచ్చెద ననియెను. అశ్వారోహణమునందు నిపుణుఁడైన యాశూద్రకుఁడు విధిమాయలోఁ జిక్కి మోఁకాళ్లలో సత్తువలేకపోయినను శూరత్వమున దానిపై నెక్కెను. ఆగుఱ్ఱము వాని నొకమఱ్ఱిచెట్టుక్రిందికిఁ గొనిపోయెను. అతని కక్కడ నాసమయమునఁ జావున్నది. కావున నాచెట్టుకొమ్మ దగిలి క్రిందఁబడి మృతినొందెను. అనిగాథ.

చ. ఘనబలసత్త్వమచ్చుపడఁ గల్గినవానికి హానిలేదిచోఁ
దనదగుసత్త్వమే చెఱచుఁదన్న నదెట్లన నీరు లావుగాఁ
గను వసియించినం జెఱువుకట్టకు సత్త్వము చాలకున్నచోఁ
గనుములు పెట్టికట్ట నడిగండితెగంబడకున్నె భాస్కరా. 38

టీక. భాస్కరా! ఘనబలసత్త్వము=ఘన=గొప్పదైన, బల=బలమును, సత్త్వమున్=సారమును, అచ్చుపడన్=ప్రకాశముగ (అచ్చువేసినట్లు) కల్గినవానికి=ఉన్నయతనికి, హాని=ఇతరులవలనబాధకలుగకపోయినను, తనది+అగుసత్త్వమే+తన్నున్=అతనిసత్తువతనినే, చెఱచున్=పాడుచేయును. ఉదాహరణము- అది+ఎట్లు+అన్నన్=ఏవిధమునననఁగా:- నీరు=జలము, లావుగాన్+కన్=విస్తారములగునట్లు, వసించినన్=నిలిచినయెడల, చెఱువుకట్టకున్=తటాకముగట్టునకు, సత్త్వము=బలిమి (దృఢత్వము) చాలక+ఉన్నచోన్=లేనియెడల, కనుములు=బొంగలు, పెట్టి=కలిగించి, కట్టనడిన్=గట్టునడుమ, గండి=అలుగులు, తెగంబడక+ఉన్నె=తెగిపోవక, యుండునా.

తాత్పర్యము. బలవంతుని కితురులవలన హాని కలుగక పోయినను దానివలననే తనకు హాని కలుగవచ్చును. నిండినచెఱువు గట్టుబలము చాలనిదైనచో గట్టునఁ బొంగలులేచి గండ్లు పడి పోవునుగదా.

చ. ఘనుఁడగునట్టివాఁడు నిజకార్యసముద్ధరణార్థమై మహిం
బనివడి యల్పమానవునిఁ బ్రార్థనసేయుట తప్పుగాదు గా
యనఘతఁ గృష్ణజన్మమున నావసుదేవుఁడు మీఁదబెత్తుగాఁ
గనుఁగొని గాలిగానిఁ గడకాళ్లకు మ్రొక్కఁడె నాఁడు భాస్కరా.

టీక. భాస్కరా! ఘనుఁడు + అగునట్టివాఁడు = గొప్ప స్థితిమంతుఁడైన నరుఁడు, నిజ + కార్య + సముద్ధరణ + అర్థము + ఐ = తన, పని, నెఱవేర్చుకొను, నిమిత్తముగా, మహిన్ = లోకములో, పనివడి = ప్రయత్నించి, అల్పమానవుని = తక్కువస్థితిలోనున్నవానిని, ప్రార్థనచేయుట = కోరుట, తప్పు = కూడనిపని, కాదుగా = అగుటలేదుసుమా. ఉదాహరణము- ఆ, వసుదేవుఁడు = ప్రసిద్ధుఁడైన వసుదేవుఁడు, (అనకదుందుభి) కృష్ణజన్మమునన్ = శ్రీకృష్ణపరమాత్మ కారాగారములోఁ బుట్టినపుడు, ఘనతన్ = గౌరవముతో, మీఁదుబెత్తుగాన్ = తన యుక్తికిఁ బైయెత్తుగా, గాలిగానిన్ = గాడిదను, కనుఁగొని (నీవు అఱచినఁ గావలవారులేతురు, నా కార్యభంగము జరుగును, నీవుకూయవలదని) కడకాళ్లకు, వెనుకటికాళ్లకు, మ్రొక్కఁడె = కేలుమొగిడ్చి వేఁడలేదా.

తాత్పర్యము. సమయానుకూలముగాఁ గార్యసాధకము

న్నైన గొప్పవాఁడల్పుని బ్రార్థించుటలో హానిలేదు. పూర్వము కృష్ణుని కంసునకుఁ జూపకుండ వసుదేవుఁడు కొనిపోవుచు నీవీసమయములో నద్దుచేయవలదని గాడిదకాళ్లకు మ్రొక్కెనని చెప్పుకొనుట వినలేదా. వసుదేవుఁడు శ్రీకృష్ణునితండ్రి.

చ. ఘనుఁ డొకవేళఁ గీడ్పడినఁ గ్రమ్మఱ నాతని లేమి వాపఁగాఁ
గనుఁగొన నొక్కసత్ప్రభువుగాక నరాధము లోపరెందఱుం
బెనుచెఱు వెండినట్టితఱిఁ బెల్లున మేఘుఁడు గాక నీటిలోఁ
దనుపఁ దుషారము ల్శతశతంబులుచాలునటయ్యా భాస్కరా.

టీక. భాస్కరా! కనుఁగొనన్ = ఆలోచింపఁగా, ఘనుఁడు = అధికుఁడైనవాఁడు, కీడ్పడినన్ = లేమిపడి (నిర్ధనుఁడై) నప్పుడు, క్రమ్మఱన్ = మరల, ఆతనిలే = అబీదపడినవాని దారిద్ర్యమును, వాపఁగాన్ = తొలఁగించుటకు, ఒక్క + సత్ + ప్రభువు + కాక = ఒక, దొడ్డ, యధికారియే, కావలయును గాని (సమర్థుఁడగునుగాని) ఎందఱున్ = ఎంతమందియైనఁగాని మఱి, నర + అధములు = హీన, మానవులు, ఓపరు = సమర్థులు కారు. ఉదాహరణము. పెనుచెఱువు = గొప్పతటాకము, ఎండిన + అట్టితఱిన్ = వట్టిపోయినప్పుడు, పెల్లునన్ = విస్తారముగా, నీటితోన్ = జలముచేత, తనుపన్ = సంతోషపఱచుటకు (నిండించుటకు) మేఘుఁడు కాక = మేఘుఁడే నిండింపవలయునుగాని, శతశతంబులు = అనేకములైనను, (వందవందలు) చాలును + అటు + అయ్యా = సమర్థములగునా.

తాత్పర్యము. ధనికుఁడైన యొక్కఘనుఁడు పేదపడినచో

వానియుద్ధరించుటకు ధనికుఁడైన ఘనుఁడే కావలయును గాని నిర్ధనుఁడైన హీనుఁడు చాలఁడు. చెఱు వెండినపుడు మేఘుఁడు ఘనవృష్టిచే నింపించుటకు సమర్థుఁ డగుంగాని కఱవులక్షణముగాఁబడు ప్రాతఃకాలతుషారము లెన్ని నింపింపఁ గలవు.

ఉ. చంద్రకళావతంసుకృప చాలనినాఁడు మహాత్ముఁడైనఁదా
సాంద్రవిభూతిఁ బాసియొకజాతివిహీనునిఁగొల్చియుంటయో
గీంద్రనుతాంఘ్రిపద్మ మతిహీనత నొందుటకాదుగా; హరి
శ్చంద్రుఁడువీరబాహునినిజంబుగఁగొల్వఁడెనాఁడుభాస్కరా.

టీక. భాస్కరా! యోగి + ఇంద్ర + నుత + అంఘ్రి పద్మ=మహాయోగులచేఁ గొనియాడఁబడు పదపంకజములు గలవాఁడా, మహాత్ముఁడైనన్=గొప్పవాఁడైనను, చంద్రకళావతంసుకృప=చంద్రకళా=చంద్రరేఖను, అవతంసు=కర్ణభూషణముగాఁగశివుని, కృప=దయ, చాలనినాఁడు=తక్కువయినసమయములో, తాన్=ఆదైవకృపచాలనివాఁడు, సాంద్రవిభూతిన్=అత్యైశ్వర్యమును, పాసి=పోఁగొట్టుకొని, ఒక జాతివిహీనునిన్=ఒక్క,హీనవంశమువానిని, కొల్చి=సేవించుచు, ఉంట=ఉండుట, మతిహీనతన్=బుద్ధిలేకపోవుటను, ఒందుట=పొందుట, కాదుగా=కాదుగదా. ఉదాహరణము.-నాఁడు=ఆకాలమున, హరిశ్చంద్రుఁడు=ఈమహారాజు, వీరబాహునిన్=ఈపేరుగలచండాలుని, నిజంబుగన్=సత్యముగ, కొల్వఁడె=కొలిచియుండలేదా.

తాత్పర్యము. ఈశ్వరకృప లేనినాఁడు గొప్పవాఁడు స్థితి చెడి తక్కువవానిని జేరుట తప్పగాదు. తెలివితక్కువ యన రాదు. తొల్లి హరిశ్చంద్రుఁ డను ప్రభువు విశ్వామిత్రునిచే రాజ్యహీనుఁడై వీరబాహుఁ డనుమాలను గాశిలోఁ గొలిచి యుండుట వినమా.

ఉ. చక్కఁ దలంపఁగా విధివశంబున నల్పునిచేతనైనఁ దాఁ
జిక్క యవస్థలం బొరలుఁ జెప్పఁగరాని మహాబలాఢ్యుఁడున్
మిక్కిలి సత్త్వసంపదల మీఱిన గంధగజంబు మావఁటీఁ
డెక్క యదల్చికొట్టి కుదియించిననుండ దెయోర్చి భాస్కరా.

టీక. భాస్కరా! విధివశంబునన్ = అదృష్టవశమున, చెప్పఁగన్ + రాని = చెప్పుటకలవిగాని, మహాబలాఢ్యుఁడున్ = అతిబలవంతుఁడుకూడ, చక్కన్ - తలంపఁగాన్ = బాగుగా, యోజించిచూడఁగా, అల్పునిచేతనైనన్ = హీనబలునిచేతిలో నైనను, తాన్ = (ఆబలవంతుఁడు) చిక్కి = వశుఁడై, అవస్థలన్ = పాట్లను, పొరలున్ = అనుభవించును. ఉదాహరణము- మిక్కిలి = ఎక్కుడు, సత్త్వసంపదలన్ = బలముకలిమిని, మీఱిన = అతిశయించిన, గంధగజంబు = మదముగల యేనుఁగుకూడ (మత్తాగొన్న యేనుఁగు) మావఁటీఁడు = అధోరణుఁడు, ఎక్కి = తనమీఁదికెక్కి, అదలించి = గద్దించి, బెదరించి = భయపెట్టి, కొట్టి = అంకుశముతోఁబొడిచి, కుదియించినన్ = అడఁగఁద్రొక్కినన్, ఓర్చి = సహించి, ఉండదె = ఊరకుండుటలేదా.

తాత్పర్యము. బలశాలియు నొకప్పుడు దుర్బలునిచేతఁ

జిక్కి బాధపడవలసివచ్చును. మదవుచేమఁగు మావంతు వీఁ డెక్కి క్రొట్టి బాధించిన నూఱకుండుటలేదా. విధిబలము తప్ప దయినను డెవ్వరికైనను శాంతము మంచిది.

చ. చదువదియెంత గల్గి రసజ్ఞత యించుకచాలకున్న నా
చదువు నిరర్థకంబు గుణసంయుతు లెవ్వరు మెచ్చరెచ్చటం
బదనుగ మంచికూర నలపాకము చేసిననైన నందు నిం
పొదవెనుఉప్పులేకరుచిపుట్టఁగనేర్చునటయ్య భాస్కరా. ౨౭

టీక. భాస్కరా! చదువు=విద్య, అది, ఎంత, కల్గినన్=ఎంతయున్నప్పటికిని, రసజ్ఞత=రస=సారమును, జ్ఞత=ఎఱిఁగికొనుశక్తి, ఇంచుక=కొంచెము, చాలక + ఉన్నన్=చాలనియెడల, ఆచదువు=ఆనేర్చినవిద్య, నిరర్థకంబు=నిరుపయోగమైనది, గుణసంయుతులు=సుగుణములతోఁ గూడినవారు, ఎవ్వరున్=ఎవ్వరును, మెచ్చరు=పొగడరు. ఉదాహరణము- మంచికూరను=రుచియైనశాకమును, పదనుగన్=తగినట్లు, నలపాకము చేసినన్ + ఐనన్=నలుఁడువండినట్లు వండినను, అందున్=ఆకూరలో, ఇంపు=రుచి, ఒదవెను=పుట్టెను, ఉప్పు=లవణము, లేక=చేర్పక, రుచి, పుట్టఁగన్, నేర్చునటయ్యా=రుచిపుట్టునటయ్యా, రుచిపుట్టదు.

తాత్పర్యము. రసజ్ఞుఁడుకాఁడేని, వాఁడెంత తెలివిగలవాఁడయినను విద్యావంతుఁడైనను, నిరర్థకము. ఎంతమంచికూరయైనను, దానినినలుఁడువండినను, ఉప్పుచేర్పనిచో నేమి రుచిపుట్టును. నలుఁడు, భీముఁడువంటచేయుటలోఁ బ్రసిద్ధులు

ఉ. చాలఁబవిత్రవంశమున సంజనితుం డగునేని మొట్టిదు
శ్శీలుని నైనఁ దత్కులవిశేషముచే నొకపుణ్యుఁ డెంతయుం
దాలిమి నుద్ధరించును సుధానిధిఁ బుట్టంగఁగాదె శంభుఁడా
హాలహాలానలంబుగళమందుధరించుటపూని భాస్కరా. ౪౩

టీక. భాస్కరా ! చాలన్ = మిక్కిలి, పవిత్రవంశమునన్ = పరిశుద్ధమైన కులమునందు, సంజనితుండు + అగున్ + ఏని = పుట్టినవా, డయినను, తత్ + కులవిశేషముచేన్ = ఆమంచికులముయొక్క గౌరవముచేత, ఎంతదుశ్శీలునిన్ + ఐనన్ = ఎట్టి, దుస్స్వభావముగలవానినైనను, ఒకపుణ్యుఁడు = ఒక్క పుణ్యాత్ముఁడు, ఎంతయున్ = మిక్కిలి, తాలిమిన్ = ఓర్పుతో, ఉద్ధరించును = ఘనతచూపును. ఉదాహరణము- సుధానిధిన్ = పాలసముద్రములోఁ, పుట్టుటన్ = పుట్టుటచేతను, కాదె = కదా, ఆహాలహాలానలంబున్ = ఆహాలాహాలమును, నగ్నివిషమును, శంభుఁడు = ఈశ్వరుఁడు, పూని = పుచ్చుకొని, గళమందున్ = కంఠములో, ధరించుట = ఉంచుకొనుట, కాలకూటము చెడ్డది, కాని, అదిపాల్కడలిలోఁ బుట్టుటచేత శంభుఁడను పుణ్యాత్ముఁ డుద్ధరించుటకుఁ గారణమైనది.

తాత్పర్యము. ఎంతదుష్టుఁ డయినను సత్కులప్రసూతుని నెవ్వఁరయినఁ బుణ్యాత్ము లాదరింతురు. పాలకడలిలోఁ బుట్టుటచేతనే గదా హాలాహాలము విషమైనను శివుఁడు తన కంఠమునం దుంచుకొనుట.

ఉ. చేరి బలాధికుం డెఱిఁగి చెప్పినకార్యము చేయకుండినం
బారము ముట్టలేఁ డొక నెపంబునఁ దాఁ జెడు నెట్టిధన్యుఁడుం
బోరక పాండుపుత్త్రులకు భూస్థలిభాగము పెట్టుమన్న కం
సారినిఁ గాకుచేసి చెడఁడాయెనె కౌరవభర్త భాస్కరా. ౪౪

టీక. భాస్కరా! బల + అధికుండు = అధికబలముగలవాఁడు, చేరి = దగ్గఱకువచ్చి, ఎఱిఁగి = తెలిసికొని, చెప్పినకార్యము = బోధించినదానిని, చేయకుండినన్ = చెప్పినట్లుచేయఁడాయెనా, పారము = ఒడ్డును, ముట్టలేఁడు = చేరలేఁడు, ఎట్టిధన్యుఁడును = ఎంతటిఘనుఁడును, ఒకనెపంబునన్ = ఏదోమిషచేత, తాన్ = అతఁడు, చెడున్ = చెడిపోవును. ఉదాహరణము.- పోరక = యుద్ధముచేయక, పాండుపుత్త్రులకున్ = పంచపాండవులకు (పాండురాజుకుమారులు పాండుపుత్త్రులు) భూస్థలిన్ = రాజ్యములో, భాగము = పాలు, పెట్టుము + అన్న = ఇమ్మని, అనిచెప్పిన, కంసారిని = కంస + అరిని = కంసుని, సంహరించిన కృష్ణుని, కాకుచేసి = ఎదిరించి (అనాదరముచేసి) కౌరవభర్త = కౌవరరాజు, దుర్యోధనుఁడు, చెడఁడు + ఆయెనా = చెడిపోయినవాఁడు, అయ్యెనా లేదా.

తాత్పర్యము. తెలివిగలవాఁడు మంచిచెడ్డ లెఱిఁగి యిది యిట్లు చేయుమని చెప్పిన విననివాఁ డెంతటి వాఁడైనను జెడును. పాండవులతో వైరము వలదు. రాజ్యములో భాగము పెట్టుము. లేనిచోఁ జిక్కులుకలవని చెప్పినకృష్ణుని తిరస్కరించి దుర్యోధనుఁడు చెడఁడా.

ఉ. చేసినదుష్టచేష్ట నది చెప్పక నేర్పునఁ గప్పిపుచ్చి తా
మూసినయంతటన్ బయలు ముట్టకయుండదదెట్లు రాగిపైఁ
బూసినబంగరుం జెదరిపోవఁ గడంగిన నాఁడు నాఁటికిన్
దాసినరాగి కానఁబడదా జనులెల్లనెఱుంగ భాస్కరా. ౪౫

టీక. భాస్కరా! చేసినదుష్టచేష్టన్=ఒకఁడు, చేసినట్టి దుష్కార్యమును, అది, చెప్పక=చేసినట్లుచెప్పక, నేర్పునన్=నిపుణముగా, కప్పిపుచ్చి=దాఁచిపెట్టి, మూసినయంతటన్=రహస్యముగా నుంచినను, (ఎప్పటికైన) బయలు+ముట్టక+ఉండదు=బైట, పడక, మానదు. ఉదాహరణము. అది+ఎట్లు=ఎట్లనఁగా, రాగిపైన్=రాగివస్తువుమీఁద, పూసిన=మొలాముచేసిన, బంగరు=బంగారము, చెదరిపోవన్=అఱిగి పోవుటకు, కడంగినన్=కొంతకాలమునకు మొదలుపెట్టఁగానే, నాఁడునాఁటికిన్=నానాఁటికి (క్రమక్రమముగా, ఆనాఁటికా నాఁడు) దాసినరాగి=ఆబంగారు క్రిందనున్న రాగిరంగు, జనులు+ఎల్లన్+ఎఱుంగన్=అందఱు, చూచుచుండఁగా కానఁబడదా.

తాత్పర్యము. దుష్టుఁ డేమైన చెడుపని చేసి దానిని గోప్యముచేసి యెవ్వరితోఁ జెప్పకుండ మూసినముత్తెమువలె నుండినను ఆపని కొన్నినాళ్లకుఁ దనంతట తానే బైలుపడి యా దుష్టుని రహస్యము బైలగును గాని దాఁగదు. పనివాఁడు బంగారువస్తువని మోసముచేయుటకై రాగివస్తువుపై బంగారు జలపోతపోసినను(గిల్టుచేసినను) అది కొన్నినాళ్ళ కఱఁగిపోవఁజొచ్చిన రాగిబయల్పడి యాతనిమోసము ప్రకట మగుటలేదా.

చ. తగిలిమదంబుచే నెదిరిఁదన్ను నెఱుంగక దొడ్డవానితోఁ
బగఁగొని పోరుటెల్ల నతిపామరుఁడై చెడుటింతె కాక తా
నెగడి జయింపనేరఁడది నిక్కము తప్పదు ధాత్రిలోపలం
దెగియొకకొండతోఁదగరుఢీకొని తాఁకినఁ జేమిభాస్కరా. ౪౬

టీక. భాస్కరా ! తగిలి=వెంటాడి (ఒక్కనరుఁడు) మదంబుచేన్=గర్వముచేత, ఎదిరిన్=ఎదుటివాని బలమును, తన్నున్=తనబలమును, ఎఱుంగక=తెలిసికొనలేక, దొడ్డవానితోన్=ఘనునితో, పగన్+కొని=వైరము, పూని, పోరుట+ఎల్లన్=జగడమాడుట యంతటివలనను, అతిపామరుఁడు+ఐ=మిక్కిలియజ్ఞానియై, చెడుట=చెడిపోవుటయే, ఇంతె కాక=ఇంతమాత్రమేకాని, తాన్=అతఁడు, నెగడి=మీఱి, జయింపనేరఁడు=బలవంతునితో నిగ్రహింపఁగలఁడా, అది, నిక్కము=ఆసంగతి, యథార్థము, తప్పదు=తప్పకచెడును. ఉదాహరణము- ధాత్రిలోపలన్=ఈభూలోకములో, తగరు=గొఱ్ఱెపోతు, తెగి=తెగించి, ఒకకొండతోన్=ఒకపర్వతముతో, ఢీకొని=ఢీదిక్కులుకొట్టి, తాఁకినన్=పొడిచినను, ఏమి=ఏమిలాభము, తనతలనొప్పియేకాని కొండకదలదు.

తాత్పర్యము. తనబలము నితరులబలము నెఱుఁగకుండ జగడమాడఁజూచు దుర్గర్వి, తన తెలివితక్కువ వెల్లడించుకొనుటయే కాని వారితో గెల్చి నిలువఁగలఁడా. కొండతో (గొఱ్ఱె) పోట్లు ఢీకొనినందున దానికేమిలాభము కలిగినది.

చ. తడవఁగరాదు దుష్టగుణుఁదత్త్వ మెఱుఁగక యెవ్వరైననా
చెడుగుణమిట్లు వల్లదని చెప్పినఁ గ్రక్కునఁగోపచిత్తుఁడై
కడుఁ దెగఁజూచుఁగా; మరుఁగఁగాఁగిన తైలము నీటిబొట్టుపైఁ,
బడునెడ నాక్షణంబెగసిబగ్గున మండక యున్నె భాస్కరా. ౪౨

టీక. భాస్కరా! దుష్టగుణున్ = దుష్టస్వభావుని, తత్త్వమున్ = వానినైజమును, ఎఱుఁగక = తెలిసికొనక, తడవఁగ రాదు = వానికిబుద్ధిచెప్పుటకై పూనుకొనరాదు, ఎవ్వరైనన్ = ఎఱుఁగని వారెవరైనను, ఆ చెడుగుణము = ఆకూడనిపని, ఇట్లు = ఈరీతిది, వల్లదు = చేయకుము, అని, చెప్పినన్ = అని బోధించినా, గ్రక్కునన్ = శీఘ్రమే, కోపచిత్తుఁడు + ఐ = మనస్సులోఁగోపించినవాఁడై, కడున్ = మిక్కిలి, తెగన్ = ఎదు ర్కొనుటకు, చూచున్ + కా = యత్నించునుగదా. ఉదాహరణము- మరుఁగఁగాఁగిన తైలము = సలసలమరిగిననూనె, నీటి బొట్టు = ఉదకబిందువు, పైన్ + పడు + ఎడన్ = మీఁద, పడి నట్టి, సమయమున, అక్షణంబ = అప్పుడే, ఎగసి = పైకెగగొట్టి, బగ్గున = బగ్గుమని, మండక + ఉన్నె = మంటలురాకుఁడ, ఊర కుండునా

తాత్పర్యము. దుష్టునిగుణ మెఱుంగక వానికి బుద్ధి చెప్పుటకై మంచిమాట లాడినయప్పుడే వాఁడు కోపించి పైఁ బడుటకు సిద్ధమగును. కాఁగిన నూనెలో నీటిబొట్టుపడిన బగ్గున మండును గాని చల్లారి యూరకుండుట కలదా.

చ. తనకు ఫలంబు లేదని యెద దలపోయఁడు కీర్తిఁగోరునా
ఘనగుణశాలి లోకహితకార్యము మిక్కిలి భారమైన మే
లనుకొని పూను; శేషుఁడు సహస్రముఖంబులఁ గాలిఁ గ్రోలి తా
ననిశము మోవఁడే మఱి మహాభరమైన ధరిత్రి భాస్కరా. ౪౮

టీక. భాస్కరా! కీర్తిన్=యశస్సును, కోరు=అపేక్షించు, ఆ ఘనగుణశాలి=ఆమంచిగుణములుగల సత్పురుషుఁడు, లోకహితకార్యము=లోక=జనులకు, హిత=ప్రియమైన, కార్యము=పని, మిక్కిలి=విస్తారము, భారము+ఐనన్=భరింపరానిదైనను, మేలు+అనుకొని=మంచిదే, యని, పూనున్=పరోపకారము చేయుటకు నడుముకట్టును, తనకున్, ఫలంబు, లేదు, అనియే=తనకు, ఏమియు, లాభములేదుగదా యని, ఎదన్=మనస్సులో, తలపోయఁడు=ఊహించుకొనఁడు. ఉదాహరణము- శేషుఁడు=ఆదిశేషుఁడనుసర్పరాజు, సహస్రముఖంబులన్=వేయిముఖములతోను, గాలిన్=వాయువును మాత్రము, క్రోలి=త్రాగి, తాన్=ఆశేషుఁడు, అనిశమున్=ఎల్లప్పుడును, మఱి=మిగుల, మహాభరము=అతిభారము, ఐన, ధరిత్రిన్=కలిగినభూమిని, మోవఁడే=మోచుటలేదా.

తాత్పర్యము. సత్పురుషుఁడు తనకు లాభము లేనిపనియైనను లోకోపకారమునకై కీర్తినిగోరి చేయుటకు సిద్ధపడును. అన్నముతినక గాలినిదిని శేషుఁడు భూమినిదలపైఁ బెట్టుకొని పరోపకారమునకేగదా మోయుచున్నాఁడు. తనకేమైన లాభమున్నదో లేదో విచారించి మోయుచున్నాఁడా, లేదు.

చ. తనకునదృష్టరేఖ విశదంబుగఁ గల్గినఁగాని లేనిచో,
జనునకు నెయ్యెడం బరులసంపదవల్ల ఫలంబు లేమగా;
కనుఁగవ తెన్నుగాఁ దెలివి గల్గినవారికిఁగాక గ్రుడ్డికిం
గనుపడునెట్లు వెన్నెలలు గాయఁగనందొకరూపుభాస్కరా.

టీక. భాస్కరా! తనకున్ = ఒక్కనికి, అదృష్టరేఖ = భాగ్యపుగీటు, విశదంబుగన్ = స్పష్టముగా, కల్గినన్ + కాని = ఉన్నప్పుడేకాని, లేనిచోన్ = లేనిదినములలో, జనునకున్ = మనుష్యునికి, ఏ + ఎడన్ = ఏచోటనుగాని, పరులసంపదవల్లన్ = ఇతరులకున్న సంపదతో, ఫలంబు = లాభము, లేమగా = ఉండదుచుమా. ఉదాహరణము- కను + కవ = రెండుకన్నులలో, తెన్నుగా = చక్కఁగా, తెలివి = ప్రకాశము, కల్గినవారికిన్ = ఉన్నవారికే, కాక = కాని, గ్రుడ్డికిన్ = నేత్రములలో దృష్టిప్రకాశములేనివానికి, వెన్నెలలు, కాయఁగన్ = చంద్రకాంతి, వెలుఁగుచుండఁగా, అందున్ = ఆవెన్నెలతేటలో, ఒకరూపు = ఏరూపమైనను, ఎట్లు, కనుపడున్ = ఏవిధముగా నగపడును? అగపడదు.

తాత్పర్యము. అదృష్టహీనునకుఁ బరులభాగ్యమువలన నేమియు ఫలముండదు. ఒక్కరి సొమ్మొక్కరి కెట్లువచ్చును. వెన్నెలగాయుచున్నపుడు కన్నులున్నవానికే లాభముగాని గ్రుడ్డివానికేమైనఁగలదా.

ఉ. తాలిమితోడుతం దగవు తప్పక నేర్పరి యొప్పుదప్పులం
జాలనసేయుఁగా కట నుపాయవిహీనుఁడు సేయనేర్చునే

పాలును నీరు నేఱుపఱుపంగ మరాళమెఱుంగుఁగాక మా
ర్జాల మెఱుంగునే తదురుచారు రసజ్ఞతఁ బూని భాస్కరా. ౫౦

టీక. భాస్కరా! నేర్పరి=నిపుణుఁడు, తాలిమితోడుతన్=శాంతము వహించి, తగవు=మర్యాద, తప్పక=తొలంగక, ఒప్పు+తప్పులన్ = మంచిని, చెడ్డను, పాలన+చేయున్+కాక=పరిపాలించునే కాని, అటన్=ఆవిషయములో, ఉపాయవిహీనుఁడు=నేర్పుచాలనివాఁడు, చేయన్+నేర్చును+ఏ=పరిపాలనచేయఁగలఁడా. ఉదాహరణము- పాలును=క్షీరమును, నీరున్=ఆపాలలోఁ గలిసిన నీటిని, ఏఱుపఱుపంగన్=విభజించుటకు (పాలకుఁ బాలు, నీటికి నీరు విడఁదీయుటకు) మరాళము=హంసము, ఎఱుంగున్+కాక=ఎఱుఁగునుగాని, తత్+ఉరు+చారు+రస+జ్ఞతన్=ఆ, గొప్ప, మంచి, సరసతను గ్రహించుశక్తిని, పూనన్=పొందుటకు, మార్జాలము=పిల్లి, ఎఱుంగునే=తెలియఁగదా.

తాత్పర్యము. మంచిని చెడ్డను విభాగించి న్యాయ మగు తీర్పు చెప్పుట కుపాయవంతుఁడు సమర్థుఁ డగునుగాని ఉపాయము చాలనివానివలనఁ గాదు. పాలను దెచ్చి యందుఁ గలసిన నీటిని నేఱుపఱుచు శక్తి హంస కున్నదిగాని చూడఁగానే కక్కుఱితిపడు మూర్ఖమార్జాలమునకా పాలలోని నీరు విడఁదీయు నేర్పును ఓర్పును గలదా.

ఉ. తాలిమితోడఁ గూరిమిఁ గృతఘ్నున కెయ్యెడ నుత్తమోత్తముల్
మే లొనరించినన్ గుణము మిక్కిలిఁ గీడగుఁ బాముపిల్లకుం

బాలిడి పెంచిన న్విషము పాయఁగనేర్చునె దానికోఱలం
జాలఁగనంతకంతకొకచాయను హెచ్చునుగాక భాస్కరా. ౫౧

టీక. భాస్కరా! కృతఘ్నునకున్ = ఉపకారమును మఱచునతనికి, ఉత్తమ + ఉత్తముల్ = మిక్కిలియుత్తమపురుషులు, కూరిమినన్ = ప్రేమతో, ఎయ్యెడన్ = ఎప్పుడైనను, తాలిమితోడన్ = ఓపికతో, మేలు = ఉపకారము, ఒనర్చినన్ = చేసినను, గుణము = దానికిఁ బ్రత్యుపకారము, మిక్కిలిన్ = ఎక్కువగా, కీడు = హానియే, అగున్ = సంభవించును. ఉదాహరణము- పాముపిల్లకున్ = చిన్నపామునకు, పాలు + ఇడి = పాలుపోసి, పెంచినన్ = పోషించినను, దానికోఱలన్ = ఆపాముపిల్లదంతములలో, చాలఁగన్ = మిక్కిలిగన్, అంతకు + అంతకున్ = క్రమక్రమముగా, ఒకచాయను = ఒకవిధముగా, హెచ్చునుగాక = పెరుఁగునుగాని, విషము = గరళము, పాయఁగనేర్చునె = తొలఁగిపోవునా.

తాత్పర్యము. కృతఘ్నునకు మంచివారు మేలుచేసినను అది వారి కపకారముక్రిందనే పరిణమించును. పాముపిల్లకుఁ బాలు పోసి పెంచినను ఆపాలపెంపు విషమునే వృద్ధిచేయును గాని విషముతొలఁగదు.

చ. తెలియనికార్యమెల్లఁ గడతేర్చుట కొక్కవివేకిఁ జేకొనన్
వలయునటైనదిద్దుకొనవచ్చుఁ బ్రయోజనమాంద్యమేమియుం
గలుగదు ఫాలమందుఁ దిలకంబిడునప్పుడు చేత నద్దముం
గలిగినఁ జక్కఁజేసికొనుఁగాదె నరుండది చూచి భాస్కరా. ౫౨

టీక. భాస్కరా! తెలియనికార్యము=తనకుబోధపడని పనిని, ఎల్లన్=అంతయును, కడతేర్పుటకున్=ముగించుకొనుటకు, ఒక్కవివేకిన్=ఒకబుద్ధిమంతుని, చేకొనవలయున్=ఉంచుకొనవలయును, అట్లైనన్=అట్లుంచుకొన్నచో, దిద్దుకొనవచ్చున్=చక్కగాసవరించుకొనవచ్చును, ఏమియున్=కొంచెమైనను, ప్రయోజనమాంద్యము= కార్యముననాలస్యము, కలుగదు=ఉండఁబోదు. ఉదాహరణము- ఫాలమందున్=నొసట, తిలకంబు=బొట్టు, ఇడునప్పుడు=పెట్టుకొనునపుడు, చేతన్=చేతిలో, అద్దమున్=దర్పణమును, కలిగినన్=ఉంచుకొనినయెడల, నరుండు=మనుజుఁడు, అది చూచి=దానింగాంచి, చక్కచేసికొనున్ + కాదె=వంపుటొంపులు దిద్దుకొనవచ్చునుగదా.

తాత్పర్యము. తనకుఁ దిన్నగాఁ జేసికొనుటకుఁ దెలియనియపుడు తనయొద్ద నొక్కయెఱిఁగినవానిని బెట్టుకొన్నయెడల నాపనిని జక్కఁగా జేసికొనవచ్చును. బొట్టుపెట్టుకొన్నప్పుడు అది గుండ్రముగాఁ గాని సరిగాఁ గాని యుండనపుడు చేతిలో నద్దముంచుకొన్నయెడల దానిసాయమున దిద్దుకొనవచ్చును గదా.

ఉ. దక్షుఁడు లేనియింటికిఁ బదార్థము వేయొకచోట నుండి వే
లక్షలు వచ్చుచుండినఁ బలాయనమై చనుఁ గల్లగాదు; ప్ర
త్యక్షము వాఁగులున్ వఱద లన్నియు వచ్చిన నీరు నిల్చునే
యక్షయమైనగండి తెగినట్టి తటాకములోన భాస్కరా. ౫౩

టీక. భాస్కరా! దక్షుఁడు=సమర్థుఁడు, లేనియింటికిన్=లేనిసంసారియింటికి, పదార్థము=సామగ్రి, వేఱు + ఒకచోటన్ + ఉండి=ఇతరస్థలములనుండి, వేలక్షలు=వేయిలక్షలు (విస్తారము) వచ్చుచుండినన్=వచ్చుచున్నప్పటికిని, పలాయనము + ఐ + చనున్=(ఆవచ్చినవస్తువులు) కనఁబడకుండఁబోవును. కల్ల, కాదు=అసత్యముకాదు. ఉదాహరణము-ప్రత్యక్షము=మనము కన్నులయెదుటఁ జూచుచున్నదే, వాఁగులున్=కొండవాఁగులును, వఱదలును=నీటివెల్లువలును, అన్నియున్=సమస్తమును, వచ్చినన్=వచ్చినప్పటికిని, అక్షయమైన=తఱుగని, గండి తెగినట్టి=గట్టుననలుగుపడిన, తటాకములోన=చెఱువులో, నీరు, నిల్చునే=జలమేమైననిలుచునా.

తాత్పర్యము. చక్కగా సంసారము దిద్దుకొనఁగల్గు దక్షుఁడైనవాఁడింట లేనినాఁడు పైనుండి యెన్నివస్తువులు వచ్చిపడినను గనఁబడకుండఁ బోవునుగాని నిలువవు. ఏళ్లుకోళ్లనేకమై వఱదలు వచ్చిపడినను గట్టుతెగిన చెఱువులో నొక్కబొట్టయినను నిల్చుటగలదా.

ఉ. దానపరోపకారగుణధన్యతచిత్తములోన నెప్పుడున్
లేని వివేకశూన్యునకు వేములు వచ్చినవేళ సంపదల్
పూనినవేళనొక్క సరిపోలును జీఁకున కర్ధరాత్రమం
దైన నదేమి పట్టపగలైన నదేమియు లేదు భాస్కరా. ౫౮

టీక. భాస్కరా! దాన...ధన్యత + దాన=ఈవియు, పర + ఉపకార=పరులకుపకారముచేయు, గుణ=స్వభావము

యొక్క, ధన్యతన్ = కలిమి, చిత్తములోనఁ = మనస్సులో, ఎప్పుడుఁ = ఎల్లప్పుడును, లేని = లేనియట్టి, వివేక + శూన్యున కుఁ = జ్ఞానవిహీనునకు, లేములు = దారిద్ర్యము, వచ్చినవే ళన్ = సంభవించినప్పుడును, సంపదల్ = ఐశ్వర్యము, పూనిన వేళఁ = పట్టినప్పుడును, ఒక్కసరిపోలును = ఒక్కవిధముగానే యుండును. ఉదాహరణము. చీకు నకున్ = గ్రుడ్డివానికి, అర్థ రాత్రమందు + ఐనన్ = నగమురాత్రి వేళనుగాని, పట్టపగలు + ఐనఁ = మట్ట మధ్యాహ్నమునందైన, అది + ఏమి = ఏమి ప్రయోజనము, అది + ఏమియుఁ + లేదు = దానివలన నెంత యులాభము లేదు.

తాత్పర్యము. ఒకనికిఁ బెట్టుట, పరోపకారము చేయుట మొదలగు గుణములు లేనివానికి లక్షలకొలఁది ధనమున్నను శుద్ధశూన్యమైననునొక్కపోలికనే యుండును. గ్రుడ్డివానికిచీఁకటి లో నొక్కటియే, పట్టపగటిలోను నొక్కటియే గాని భేదము లేదుగదా.

ఉ. దానము సేయఁ గోరి నవదాన్యున కీయగ శక్తి లేనిచో
నైనఁ బరోపకారమునకై యొకదిక్కునఁ దెచ్చియైననీఁ
బూనును; మేఘుఁడంబుధికిఁబోయి జలంబులు దెచ్చిఈయఁడే
వానసమస్తజీవులకు వాంఛితమింపెసలార భాస్కరా. ౫౫

టీక. భాస్కరా ! దానము సేయన్ = ఒకరికీయవలయు నని, కోరినవదాన్యునకుఁ = అభిప్రాయపడినదాతకు, ఈయఁ గన్ = ఇచ్చుటకు శక్తిలేనిచోన్ + ఐనన్ = సామర్థ్యము లేక

పోయినను గూడ, పరోపకారమునకై + ఐ = ఇతరులకుపకారము చేయుటకుఁగాను, ఒకదిక్కునన్ = ఒక్కరియొద్ద, తెచ్చియైనన్ = తీసికొనవచ్చియైన, ఈన్ + పూనును = ఇచ్చుటకు సిద్ధపడును. ఉదాహరణము- మేఘుఁడు = పర్జన్యుఁడనువర్ష దేవత, అంబుధికిన్ = సముద్రమునకు. పోయి = వెళ్లి, జలంబులు = అప్పులు, తెచ్చి = కొని తెచ్చి, సమస్తజీవులకున్ = సకలప్రాణులకును, వాంఛితము = కోరిక, ఇంపు + ఎసలారన్ = సంతోషమువృద్ధికాఁగా, వాన = వర్షము, ఈయఁడే = కురియుటలేదా.

తాత్పర్యము. పరోపకారబుద్ధి గలదాత తనకు లేకున్నను వేఱొకరి యొద్దఁ దెచ్చి యిచ్చుటకే చూచును. మేఘుఁడు లోకమున కుపకారము చేయుటకై నీళ్లను సముద్రు నడిగి తెచ్చి వాన కురిపించుటలేదా.

ఉ. దానము చేయ నేరని యధార్మికుసంపద యుండియుండియుం
దానె పలాయనంబగుట తథ్యము; బూరుగుమ్రాను కాచినన్
గాని ఫలంబు లూరక వృథాపడి పోవవె యుండి గాలిచేఁ
గానలలోన నేమిటికిఁగాక యభోజ్యములౌట భాస్కరా. ౫౬

టీక. భాస్కరా! దానము చేయన్ = ఒకరి కిచ్చుట, నేరని = ఎఱుఁగని, అధార్మికుసంపద = ధర్మబుద్ధిలేని వానియైశ్వర్యము, ఉండి + ఉండియున్ = ఉన్నట్లేయుండి, యొక్కనాఁడు, తానె = తనకుఁదానె, పలాయనంబు + అగుట = పాఱిపోవుట, తథ్యము = నిశ్చయము. ఉదాహరణము- బూరుగుమ్రాను = శాల్మలీవృక్షము,(దూదిపండ్లు కాచునది), కాచినన్ = కాయలు

కాచినప్పటికి, దానిఫలంబులు=ఆచెట్టుపండ్లు, వృథా=వ్యర్థముగా, ఊరక=పనిలేక, ఎండి=శుష్కించి, గాలిచేన్=వాయువశమునఁ, కానలలోన్=అడవులలో, అభోజ్యములౌటన్=తినుటకుపకరింపని కారణమున, ఏమిటికిన్+కాక=ఎందుకును బనికిరాక, పడిపోవవె=రాలిపోవుటలేదా, పడిపోవే=అనుట లెస్స.

తాత్పర్యము. దానముచేయనివాని ధనమువానియొద్ద నుండియుండి యెప్పుడో చెప్పకుండ నశించిపోవును. అడవిలోఁ దినుటకుఁబనికిరాని కాయలుకాచినబూరుగు దూదిచెట్టుకాయలు, ఎండి, రాలి నిష్ప్రయోజనమై పోవుచున్నవిగదా.

చ. నడువక చిక్కి లేమి యగునాఁడు నిజోదరపోషణార్థమై
యడిగిభుజించుటల్ నరుల కారయవ్యంగ్యముగాదుపాండవుల్
కడు బలశాలు లేవురు నఖండవిభూతి దొలంగి భిక్షముల్
కుడువరెయేకచక్రపురిఁగుంతియుఁ దారొకచోటభాస్కరా.

టీక. భాస్కరా! నరులకున్=జనులకు, నడవక=సాగక, చిక్కి=వెనుకఁబడి, లేమియగునాఁడు=ధనముపోయి దారిద్ర్యము సంభవించినపుడు, నిజ+ఉదర+పోషణ+అర్థము+ఐ=తన, కడుపును, పోషించుకొను, నిమిత్తమై, అడిగి=బిచ్చమెత్తుకొని, భుజించుటన్=తినిబ్రదుకుట, ఆగయన్=ఆలోచింపఁగా, వ్యంగ్యము, కాదు=ఆక్షేపనార్హము గానేరదు. ఉదాహరణము- కడున్=మిగుల, బలశాలులు=బలవంతులు, ఏవురు=అయిదుగురు, పాండవుల్=(పంచపాండ

వులు) అఖండవిభూతి=అ + ఖండ=విస్తారమైన, విభూతిన్=సంపదను, తొలఁగి=పోఁగొట్టుకొని, కుంతియున్=తల్లియైన కుంతీదేవియు, తారున్=తమరైదుగురును, ఏకచక్రపురిన్=ఏకచక్రపురములో, ఒక్కచోన్=ఒక్కచోట, భిక్షముల్=బిచ్చమెత్తియన్నమును, కుడువరె=తినియుండలేదా.

తాత్పర్యము. దారిద్ర్యము సంభవించినపుడు బ్రదికి చెడ్డవారు బిచ్చమెత్తుకొని జీవించుటలోఁ దప్పు కనఁబడదు. రాజ్యాదిభోగము లన్నియు నశించినపాండవులు ఏకచక్రమను పట్టణమునకుఁబోయి యచ్చట బిచ్చమెత్తుకొని జీవించినపు డెవ్వరైన నాక్షేపించినారా లేదు.

చ. నుడువుల నేర్పుచాలని మనుష్యుఁడెఱుంగక తప్పనాడినం
గడుఁ గృపతోఁ జెలంగుదురు కాని యదల్పరు తజ్ఞులెల్లఁ ద
ప్పడుగులు వెట్టుచు న్నడుచునప్పుడు బాలునిముద్దుసేయఁగాఁ
దొడఁగుదురింతెకానిపడఁద్రోయుదురేయెవరైన భాస్కరా.

టీక. భాస్కరా! నుడువులన్=ఆడెడిమాటలలో, నేర్పు=నిపుణత, చాలని=కొఱఁతపడిన, మనుష్యుఁడు=నరుఁడు, ఎఱుంగక=జ్ఞానహీనతచేత, తప్పనాడినన్=తెలివితక్కువ మాటలుపల్కినను, తజ్ఞులు + ఎల్లన్=బుద్ధిమంతులైన పెద్దలందఱును, కడున్=మిగుల, కృపతోన్=దయతో, చెలంగుదురు=ఆదరింతురు, కాని=ఆదరింపకుండ, అదల్పరు=భయపెట్టరు. ఉదాహరణము. తప్పు + అడుగులు + పెట్టుచున్=

నడుచుటచేతగాక తప్పటడుగులు, వేయుచు, నడుచునప్పుడు= విద్దెనులు చేసి నడువఁబోవునప్పుడు, ఎవరు + ఐనన్ = ఎవ్వరయి నంగాని, బాలుని = అప్పిల్లవానిని, ముద్దు + చేయన్ + కాన్ = ముద్దుగాఁజూచియాదరించుటకే, తొడంగుదురు = యత్నింతురు, ఇంతెకాని = ఇంతియెకాక, పడన్ + త్రోయుదురె = తప్పటడుగులిడువానిని చేయూఁతయిచ్చి నడిపింతురేకాని పడఁద్రోయరుగదా.

తాత్పర్యము. మాటలు చేతగాని తెలివితక్కువవాఁడు పలికినపలుకులను బుద్ధిమంతులు మన్నింతురేగాని వానిని తొందరపెట్టి భయకంపితుం జేయరు. నడచుట చేతగాక తప్పటడుగులు పెట్టుబాలుని నడపించుటకు సాయపడుదురేకాని యెవ్వరయినఁ గ్రిందఁ బడఁద్రోయుటకై యత్నించుట కలదా.

ఉ. నేరిచిబుద్ధిమంతుఁ డతినీతివివేకము దెల్పినం జెడం

గారణమున్నవాని కదికైకొనఁగూడదు నిక్కమే దురా

చారుఁడు రావణాసురుఁడసహ్యము నొందఁడెచేటుకాలముం

జేరువయైననాఁడు నిరసించి విభీషణుబుద్ధి భాస్కరా. ౫౮

టీక. భాస్కరా! బుద్ధిమంతుఁడు = తెలివికలవాఁడు, నేరిచి = తెలిసికొని, అతి, నీతి, వివేకము = మిక్కిలిన్యాయముతోఁగూడినబుద్ధులను, తెల్పిన = బోధించినను, చెడన్ = చెడిపోవుటకు, కారణము = హేతువు, ఉన్నవానికిన్ = కలిగినవానికి, అది = ఆబోధ, కైకొనన్ = గ్రహించుటకు, కూడదు = బుద్ధిపుట్టదు, నిక్కమే = సత్యమే. ఉదాహరణము. దురాచా

రుఁడు=చెడ్డప్రవర్తనముగలవాఁడు, రావణ + అసురుఁడు= రావణుఁడను రాక్షసుఁడు, చేటుకాలము=తనకుదుష్కాలము (చెడిపోవుటకు సమయము) చేరున + ఐననాఁడు=దగ్గఱఁబడి నపుడు, విభీషణబుద్ధి=తమ్ముఁడయిన విభీషణుఁడుచేసినసద్బోధను, నిరసించి=వినక, అసహ్యము=సహించుటకు వీలులేని, కులక్షయమును=వంశనాశనమును, పొందఁడె=అనుభవింప లేదా.

తాత్పర్యము. ఎవ్వరుగాని పోఁగాలము సమీపించినపుడు, ఎట్టిన్యాయవర్తనుఁడు చెప్పినమాటలను వినఁజాలఁడు. రావణాసురుఁడు తమ్ముఁడు విభీషణుఁడు చెప్పినమాటలను వినక కులక్షయము చేసికొన్నాఁడు. దీనికిఁ గారణము సద్బోధనములను వినలేకపోవుట చేతనేకదా.

చ. నొగిలినవేళ నెంతటి ఘనుండును దన్నొకరొక్కనేర్పుతో
నగపడి ప్రోదిసేయక తనంతట బల్మికి రాఁడు నిక్కమే
జగమున నగ్నియైనఁ గడు సన్నగిలంబడియున్న నింధనం
బెగయఁగఁ ద్రోచియూఁదకమఱెట్లురవుల్కొననేర్చుభాస్కరా.

టీక. భాస్కరా! నొగిలినవేళన్=నొచ్చియున్న సమయమందు, ఎంతటిఘనుండును=ఎంతటిపెద్దమనుష్యుఁడయినను, తన్నున్=తనను, ఒకరు=ఎవ్వరయినవేఱొకరు, ఒక్కనేర్పుతోన్=ఏదైననుపాయముతో, అగపడి=అడ్డుపడి, ప్రోదిచేయక=పోషణచేయకుండ, తన + అంతటన్=తనకుఁదానే, బల్మికిన్, రాఁడు=పెంపొందలేఁడు. నిక్కమే= సత్యమే.

ఉదాహరణము. జగమునన్ = భూమిలో, అగ్ని + ఐనన్ = నిప్పుకూడ, కమన్ = మిక్కిలి, సన్నగిలన్ + పడి + ఉన్నన్ = తగ్గిపోయియున్నప్పుడు, ఇంధనంబు = పుడకలను, ఎగయన్ + ద్రోచి = ఎగఁద్రోసి, ఊఁదక = వృథముచేయకున్నచో, మఱి + ఎట్లు = ఇంక నేవిధముగా, రవులొక్కనన్ + నేర్చున్ = రాఁజఁగలదు.

తాత్పర్యము. ఎత్తువడిపదినములలో నెంతటివానినైనను రెండవవాఁడు నేర్పుతో సాయపడి పోషింపనిచో నాతఁడు రెక్కొనసేరఁడు మండిమండి పుడకలుదూరమై సన్నగిలిననిప్పు నుఁ గట్టెలు దగ్గఱచేర్చి యెవ్వరయిన నొక రూఁదకపోయినయెడల నది ప్రజ్వరిల్లునా.

ఉ. పండితులైనవారు దిగువం దగ నుండఁగ నల్పుఁ డొక్కఁడు
ద్దండతఁ బీఠమెక్కిన బుధప్రకరంబుల కేమి యెగ్గగున్;
కొండొకకోఁతి చెట్టుకొన కొమ్మలనుండఁగఁ గ్రిందగండభే
రుండమదేభసింహనికురుంబము లుండవె చేరిభాస్కరా. ౬౧

టీక. భాస్కరా! పండితులు + ఐనవారలు = విద్వాంసులైనవారు, దిగువన్ = నేలమీఁద, తగన్ = ఒప్పునట్లు, ఉండఁగన్ = కూర్చుండినపుడు, అల్పుఁడు = మూర్ఖుఁడు, ఒక్కఁడు = ఎవ్వఁడయిన నొక్కపురుషుఁడు, ఉద్దండతన్ = గర్వముతో పీఠము = ఉన్నతస్థానమున, ఎక్కినన్ = కూర్చుండినంతనె, బుధ + ప్రకరంబులకున్ = పండిత, సమూహమునకు, ఏమి, ఎగ్గు + అగున్ = హానియేమిగలుగును. ఉదాహరణము. కొం

డొక క్రోఁతి=ఏదైననొకమర్కటము, చెట్టు,కొనకొమ్మలన్= వృక్షముయొక్క అగ్రభాగమునందు, ఉండఁగన్=కూర్చుండి యున్నవుడు, క్రిందన్=ఆచెట్టుక్రిందనే, గండభేరుండ=గండభేరుండమను మృగములు, మద + ఇభ=మదపుటేనుఁగులు, సింహ=సింగములు (వీనియొక్క) నికురుంబములు=మందలు, చేరి=కూడి,ఉండవె=నివసింపవా.

తాత్పర్యము. సభలోఁబండితులు క్రిందఁ గూర్చున్న వుడు మూర్ఖుఁడొకఁడు పీఠముమీఁదఁ గూరుచున్నట్లయిన, పండితులకేమియు నవమానము గలుగదు. చెట్టుక్రింద సింహములు గండభేరుండములు మొదలగు పెద్దమృగములుండఁగాఁ జెట్టుమీఁదఁ గ్రోఁతికూర్చుండును. అంతలోనె సింహాదులకేమి ఘనతతగ్గినది.

ఉ. పట్టుగనిక్కుచున్ మదమువట్టి మహాత్ములఁ దూలనాడినం
బట్టినకార్యముల్ చెడును బ్రాణముపోవు నిరర్థదోషముల్
పుట్టుమహేశుఁ గాదని కుబుద్ధి నొనర్చినయజ్ఞతంత్రముల్
ముట్టకపోయి దక్షునికి మోసమువచ్చెఁ గదయ్య భాస్కరా.

టీక. భాస్కరా ! మదము + పట్టి=గర్వముపట్టుకొని, పట్టుగన్=పట్టుదలతో, నిక్కుచున్=విఱ్ఱవీఁగుచు, మహాత్ములన్=ఘనులను, తూలనాడినన్=తేలికపఱిచిన యెడల, పట్టినకార్యములు=తానుజేయఁబోయినపనులు, చెడున్=చెడిపోవును, ప్రాణముల్=ఉసులు, పోవును=తొలఁగిపోవును, నిరర్థదోషముల్=హేతురహితమైన పాపములు, పుట్టున్=

ఉద్భవించును. ఉదాహరణము- ఈశ్వరునిఁ = శివుని, కాదని = తిరస్కారముచేసి, కుబుద్ధిఁ = చెడుతలంపుతో, ఒనర్చిన = చేసిన, యజ్ఞతంత్రములు = యాగప్రయోగములు, ముట్టక = తుదముట్టక, పోయి = చెడి, దక్షునికిన్ = దక్షుఁడను శివునిమామకు, మోసము = హాని, వచ్చెఁ = సంభవించెను, కదయ్య = కాదటయ్యా.

తాత్పర్యము. తానెంతో గొప్పవాఁడని యితరులగు ఘనులను నిరాకరించి చేయుకార్యములు కొనసాగవు. ఈశ్వరునిబిలువక దక్షుఁడు చేయఁబోయిన యజ్ఞమునకు విఘ్నము వచ్చుటయే కాక యవమానముకూడ సంభవింపలేదా.

చ. పరహితమైన కార్యమతి భారముతోడిదియైనఁ బూను స
త్పురుషుఁడులోకములొప్పొగడఁ;బూర్వమునందొకతాలవర్షము
గురియఁగఁజొచ్చినం గదసి గొబ్బున గోజన రక్షణార్థమై
గిరినొకకేలనెత్తెనఁట కృష్ణుఁడుఛత్త్రముభాతిభాస్కరా. ౬౩

టీక. భాస్కరా! సత్పురుషుఁడు = సజ్జనుఁడు, పరహితము, పర = ఇతరులకు, హితము = అనుకూలము, అయినకార్యము = అగుపని, అతిభారముతోడిది = మిక్కిలికఠినమైనది, శ్రమసాధ్యమైనది, (బరువుతోఁగూడినది) ఐనఁ = అయినప్పటికిని లోకముఁ = లోకములోనివారు, పొగడఁ = కొనియాడినట్లు, పూనుఁ = చేయఁదొడఁగును. ఉదాహరణము- పూర్వమునందున్ = పూర్వకాలమున, ఇంద్రుఁడు = స్వర్గాధిపతి, ఒకతాలవర్షమున్ = ఒక్కశిలలతోఁ గూడినవానను, కురియఁగన్ +

చొచ్చినన్ = కురిపించుటకు మొదలిడఁగా, కృష్ణుఁడు = శ్రీ కృష్ణపరమాత్మ, గొబ్బునన్ = శీఘ్రముగా, కదిసి = సమీపించి, గోజనరక్షణార్థము + ఐ = పశువులను, గోపాలురను రక్షించుటకై, గిరిన్ = పర్వతమును, ఛత్త్రముభాతిన్ = గొడుగురీతిగా, ఒకకేలన్ = ఒక్కహస్తముతోడను, ఎత్తెన్ + అట = మీఁది కెత్తినాఁడఁటగదా.

తాత్పర్యము. సజ్జనులు పరోపకారమునకై యెంతటిఘనకార్యము నైనను లోకులుపొగడునట్లు చేయఁబోయెదరు. శ్రీకృష్ణుఁడు, ఇంద్రుఁడు కురిపించిన శిలావర్షమునుండి గోవులను గోపాలురను రక్షించుటకై గోవర్ధనపర్వతము నెత్తినాఁడు గదా.

చ. పలుచని నీచమానవుఁడు పాటిఁ దలంపక నిష్ఠురోక్తులం
బలుకుచు నుండుఁ గాని మతిభాసురుఁడైనగుణప్రపూర్ణుఁడ
ప్పలుకులఁ బల్కఁబోవఁడు నిబద్ధిగ నెట్లనఁ; వెల్తికుండఁదాఁ
దొలఁకుచునుండుఁగానిమఱిదొల్కునెనిండుఘటంబుభాస్కరా.

టీక. భాస్కరా! పలుచని నీచమానవుఁడు = తేలికబుద్ధి గలహీనుఁడు, పాటిన్, తలంపక = తగవుమర్యాదలెఱుంగక, నిష్ఠురోక్తులన్, నిష్ఠుర = కఠినములైన, ఉక్తులన్ = వాక్యములను, పలుకుచున్ + ఉండున్ + కాని = అనుచుండును కాని, మతిభాసురుఁడు + ఐన = బుద్ధితీక్ష్ణతగలవాఁడగు, గుణప్రపూర్ణుఁడు = సుగుణములతోనిండినవాఁడు (బుద్ధిశాలిగుణశాలియు నైనవాఁడు) అప్పలుకులు = ఆనిష్ఠురోక్తులను, పల్కన్ + పోఁడు = వచియింపఁదల

పఁడు, నిబద్ధి + కన్ = నిజముగానే. ఉదాహరణము-ఎట్లు + అనన్ = ఏరీతియనఁగా, వెల్తికుండ = నీరుతక్కువుగా నుండిన ఘటము, తాన్ = (ఆకుండ) తొలఁకుచున్ + ఉండున్ + కాని = నీళ్లు, మీఁదికిఁ జిందుచుండునుగాని, (ఒక్కచోటునుండి వేఱొకచోటికిఁ గొనిపోవునపుడు) మఱి = ఇతరమైన, నిండుఘటంబు = పరిపూర్ణముగా నీరున్నకడవ, తొల్కునె = తొలఁకునా.

తాత్పర్యము. తేలికవాఁడు మంచిచెడ్డ లెఱుఁగక కఠినములను వాఁగుచుండును గాని గుణవంతుఁడు బుద్ధిమంతుఁడు నట్లు వాఁగఁడు. వెలితికుండ తొలఁకునుగాని నిండుకుండ తొలఁకునా.

చ. పలుమఱుసజ్జనుండు ప్రియభాషలు పల్కుఁగఠోరవాక్యముల్
పలుకఁ డొకానొకప్పుడవి పల్కినఁ గీడునుగాదు నిక్కమే;
చలువకువచ్చి మేఘుఁ డొకజాడను దావడగండ్ల రాల్చినన్
శిలలగునోటు వేగిరమె శీతలనీరముగాక భాస్కరా. ౬౫

టీక. భాస్కరా! సజ్జనుండు = సత్పురుషుఁడు, పలుమఱు = అనేకపర్యాయములు, ప్రియభాషలు = హితమైన పలుకులను, పల్కున్ = వచించును, కఠోరవాక్యముల్ = కఠినపుమాటలు, పలుకఁడు = ఆతఁడు, ఒకానొకప్పుడు = ఏదైన విసుగుదలగా నున్నపుడు, అవి = ఆకఠోరవాక్యములు, పల్కినన్ = ఆడినను, కీడుగాదు = ఆమాటలవలన హానిసంభవింపదు, నిక్కమే = ఇదిసత్యము. ఉదాహరణము- మేఘుఁడు = పర్జన్యుఁడు, చలువకున్ = జనులకుఁజల్లగానుండుటకై, వచ్చి = ఆకాశ

ముమీఁదవ్యాపించి, తాన్, వడఁగండ్లన్=వర్షోపలములను, రాల్చినన్=కురిసినను, వేగిరమె=వెంటనే, శీతలనీరముగాన్=చల్లనినీరుగా మాఱునుగాని, శిలలు+అగునోటు=రాళ్లుగా మాఱుటకలదా.

తాత్పర్యము. సజ్జనుఁ డెప్పుడును మృదువాక్యములే పల్కునుగాని కఠినవాక్యములు పల్కఁడు. ఒకానొకప్పు డేదైన సమయమును బట్టి కఠినోక్తు లాడినను, అవి యొక్కరికిని హాని చేయవు. చేసిన మేలే చేయును. చల్లఁదనము నిచ్చుస్వభావము గలమేఘుఁడు వడగండ్లు కురిపించినను, అవి వెంటనే చల్లనీ రగును గాని ఱాలుగా నుండుటలేదుగదా.

ఉ. పాపపుఁద్రోవవాని కొకపట్టున మేను వికాస మొందినన్
లోపల దుర్గుణంబె ప్రబలుంగద నమ్మఁగఁగూడ దాతనిం;
బాఁపరకాయకు న్ననుపు పైపయిఁగల్గినఁ గల్గుఁగాక యే
రూపునదానిలోఁగలవిరుద్ధవుంజేఁదునశించు భాస్కరా. ౬౬

టీక. భాస్కరా! పాపపుఁద్రోవవానికిన్=(పాపము+త్రోవ) చెడునడతగలవానికి (తప్పుమార్గమున సంచరించువానికి) ఒకపట్టునన్=ఎప్పుడైననొకప్పుడు, మేను=శరీరము, వికాసము=ప్రకాశమును, ఒందినన్=కలిగినను, లోపల=హృదయములో, దుర్గుణంబె=దుస్స్వభావమె, ప్రబలున్+కద=వృద్ధియైయుండునుగదా, ఆతని=ఆచెడ్డదారిని దిరుగువానిని, నమ్మఁగన్+కూడదు=విశ్వసింపఁదగదు. ఉదాహరణము-పాఁపరకాయకున్=పాఁపరచెట్టునఁబుట్టుకాయలకు, ననుపు=

మృదుత్వము, పైన్ + పయిన్ = మీఁదమీఁద, కల్గినన్ = ఉండినను, కల్గున్ + కాక = ఉండవచ్చును, గాని, దానిలోన్ = ఆపాఁపరకాయలోపల, కల = ఉండునట్టి, విరుద్ధపు + చేఁదు = ఉండిన విపరీతమైన చేఁదుగుణము, ఏరూపునన్ = ఏవిధముగా, నశించున్ = విడిచిపోవును, పోనేరదు.

తాత్పర్యము. దుర్మార్గవర్తనుఁడు పైకి చక్కఁగా వేషభాషలచేఁ గనఁబడినను మనస్సులోనిదుర్గుణము విడువడు. పాఁపరకాయలు గుత్తులుగా నున్నగా నందముగాఁ గనఁబడుచున్నను దానిలోని చేఁదుగుణము పోఁజాలదు. పాఁపరయనునది యొకజాతి చేఁదుపుచ్చ, బుడమతీఁగజాతిది. గోతుంబియందురు. "చీఁపురుపాఁపరతీఁగలఁ జేఁపలబుట్టలినట్లు" అని చాటువు.

ఉ. పూనినభాగ్యరేఖ చెడిపోయినపిమ్మట నెట్టిమానవుం
డైనను వానినెవ్వరుఁ బ్రియంబునఁబల్కరుఁ బిల్వరెచ్చటం;
దానది యెట్లొకో యనినఁ దథ్యము పుష్పమువాడి వాసనా
హీనత నొందియున్నయెడ నెవ్వరుముట్టుదురయ్య భాస్కరా.

టీక. భాస్కరా! పూనిన = నరునకుఁగల్గిన, భాగ్యరేఖ = అదృష్టపుగీటు, చెడిపోయినపిమ్మటన్ = తుడిచిపెట్టుకొనిపోయినవెనుక, ఎట్టిమానవుఁడు + ఐనన్ = ఎంతటియధికుఁడయినను, ఎచ్చటన్ = ఎక్కడనుగాని, ఎవ్వరున్ = ఒక్కరును, ప్రియంబునన్ = ప్రేమతో, పల్కరున్ = పలుకరింపరు, పిల్వరు = వానినిబిలువనైనఁ బిలువరు, తథ్యము = సత్యము, తా

న్ = అది, ఎట్లు + ఒకో + అనన్ = దానికుదాహరణమేమి యందురేని, పుష్పము = పూవు, వాడి = మ్లానమై (వడలి) వాసనాహీనతన్ = (నిర్గంధత్వమును) పరిమళరహితత్వమును, ఒంది + ఉన్న యెడన్ = చెందియున్నపుడు, ముట్టుదురు + అయ్యా = దానిని పట్టుకొందురా.

తాత్పర్యము. మొదట నెంతగొప్పవాఁడైనను వానికి దారిద్ర్యము సంభవించినపిమ్మట నెవ్వరును వానిని బలుకరింపరు. పుష్పము సొగసైనదియైనను వాడిపోయినపిమ్మట దాని నెవ్వరును ముట్టఁజూడరు గదా.

ఉ. పూరితసద్గుణంబుగలపుణ్యున కించుక రూపసంపదల్
దూరము లైనవానియెడ దొడ్డుగఁ జూతురు బుద్ధిమంతు; లె
ట్లారయ గొగ్గులైన మఱియందుల మాధురిఁ జూచికాదె ఖ
ర్జూరఫలంబులం బ్రియముచొప్పడలోకులుగొంటభాస్కరా.

టీక. భాస్కరా! పూరితసద్గుణంబు = పూరిత = నిండింపఁబడిన, సత్ + గుణంబు = మంచిగుణములు, కల = కలిగిన, పుణ్యునకున్ = ధర్మాత్మునకు, రూపసంపదల్ = ఆకారముయొక్కకలిమి, ఇంచుక = స్వల్పము, దూరములు = తొలఁగియున్నవి, ఐనన్ = అయినప్పటికిని, వానియెడన్ = అధర్మాత్మునివిషయమును, బుద్ధిమంతులు = సుబుద్ధిగలవారు, దొడ్డుగన్ = గౌరవముగనే, చూతురు = భావింతురు. ఉదాహరణము-ఎట్లు = అది యేరీతియని, ఆరయన్ = ఆలోచింపఁగా, ఖర్జూరఫలంబులన్ = కర్జూరపుపండ్లు, గొగ్గులు + ఐనన్ = ఎండిముడుచుకొని గొగ్గి

గా నుండినను, మఱి=విశేషించి, యందులమాధురిఁ=వాని లోనిరుచిని, చూచి కాదె=గ్రహించియెకదా, లోకులు= ప్రజలు, ప్రియము=ప్రీతి, చొప్పడన్=కలుగునట్లు, కొంట=పుచ్చుకొనుట.

తాత్పర్యము. సుగుణరాశియైన పుణ్యాత్ముఁడు కురూపి యైనను వానిని బుద్ధిమంతులు గౌరవింతురు గాని యగౌరవింపరు. కజ్జూరపుపండ్లు నొగ్గిగానున్నను దానిలోని రుచిని గ్రహించి జనులు గ్రహించుచున్నారుగాని గర్హించుటలేదుగదా.

ఉ. ప్రల్లదనంబుచే నెఱుక పాటొకయింతయులేక యెచ్చటన్
బల్లిదుఁడైన సత్ప్రభు నబద్ధము లాడినఁద్రుంగి పోదు రే;
ట్లల్లసభాస్థలిం గుమతులై శిశుపాలుఁడు దంతవక్త్రుఁడుం
గల్లలు కృష్ణునిం బలికిగాదె హతంబగుటెల్లభాస్కరా. ౬౯

టీక. భాస్కరా ! ప్రల్లదనంబుచేన్= (ప్రల్లదుని చేష్ట-ప్రల్లదనము,) ప్రల్లదుఁడు=వ్యర్థభాషణములాడువాఁడు, వానిగుణము, ప్రల్లదనము, దానిచే=అవ్యర్థభాషణములుపలుకు స్వభావముచేత, ఎఱుకపాటు=తెలివి, ఒక, ఇంతయున్=స్వల్పమైనను, లేక=లేనివారై, ఎచ్చటన్=ఏచోటనైన, బల్లిదుఁడు=బలశాలి, ఐనసత్ప్రభున్=అయినట్టిమంచి యధికారినిగురించి, అబద్ధములు=అసత్యములగుమాటలు, ఆడినన్=పల్కినయెడల (వారు) త్రుంగిపోదురు=చెడిపోదురు,ఉదాహరణము- ఎట్లు=ఏవిధముననఁగా,అల్ల సభాస్థలిన్=ప్రసిద్ధమైన రాజసూయముచేయు పాండవులసభలో,కుమతులు+

ఐ=కుత్సితబుద్ధిగలవారై, కృష్ణునిన్=శ్రీకృష్ణపరమాత్మను, కల్లలుపలికికాదె=లేనిపోని నిందలారోపించిపల్కియేకదా, శిశుపాలుఁడు, దంతవక్త్రుఁడున్=శిశుపాలుఁడనువాఁడును, దంతవక్త్రుఁడనువాఁడును, ఎల్ల=ఇద్దఱును, హతంబు+అగుట=నశించుట.

తాత్పర్యము. వెనుకముందు తెలియంగక దొడ్డవారిమీఁద బ్రల్లఱవులఱచినవారు చెడిపోదురుగాని బాగుపడరు. రాజసూయయాగము చేయుచున్నధర్మరాజుసభలో శ్రీకృష్ణుఁడు పూజ్యుఁడుకాఁడని ప్రేలిన శిశుపాలదంతవక్త్రులు నశింపక బాగుపడిరా.

ఉ. ప్రేమనుగూర్చి యల్పునకుఁ బెద్దతనంబును దొడ్డవానికిం
దామతితుచ్ఛపుంబని నెదం బరికింపక యీయరాదుగా;
వామకరంబుతోఁడఁ గుడువం గుడిచేత నపానమార్గముం
దోమఁగవచ్చునేమిగులఁదోఁచనిచేఁతలుగాక భాస్కరా. ౭౦

టీక. భాస్కరా! ప్రేమను=ఆదరమును, కూర్చి=ఎక్కుడుచేసి, అల్పునకున్=హీనునకు, పెద్దతనంబును=గొప్పయధికారమును, దొడ్డవానికిన్=అధికునకు, అతితుచ్ఛపున్+పని=మిక్కిలియల్పాధికారమును, ఎడన్=మనసులో, పరికింపక=పరిశీలనచేయకుండ, తాము=ఆయుద్యోగమిచ్చునధికారులు, ఈయరాదుగా=ఇచ్చుట తగదుసుమా. ఉదాహరణము- మిగులన్=మిక్కిలి, తోఁచనిచేఁతలుగాక=ఊహాచాలనిపనులుగాని, వామకరంబుతోడన్=పుఱ్ఱచేతితో, కుడు

వన్ = భోజనము చేయుటయును, కుడిచేతన్ = కుడిచేతితో, అపానమార్గమున్ = గుదద్వారమును, తోమఁగన్ = కడుగుట యును, వచ్చునే = తగునా.

తాత్పర్యము. తనకిష్టుఁడైనవానికి హీనుఁడైనను గొప్పయు ద్యోగమిచ్చి తగినవానికిఁజిన్నయుద్యోగమిచ్చుట యజమాను నకుఁ దగనిపని. చక్కఁగా నాలోచింపక చేయుచేతఁగానిపని కాని న్యాయమైన పనికాదు. ఎవ్వరయిన నెవ్వరి కేట్టిపని చెప్పవలయునో వారికట్టిపనినే చెప్పవలయును గాని, కుడిచేతి పని యెడమచేతికి నెడమచేయిచేయుపని కుడిచేతికినిఁ జెప్పిన హాస్యాస్పదులుకారా.

చ. ఫలమతిసూక్ష్మమైననున్నపాలుఁడుమంచిగుణాఢ్యుఁడైనచో
నెలమి వివేకు లాతని కపేక్షయొనర్తు రదెట్లుచంద్రికా
విలసనమైనఁ దా మనుభవింపఁ జకోరము లాసఁజేరవే
చలువగలట్టివాఁ డగుటఁ జందురునెంతయుఁ గోరిభాస్కరా.

టీక. భాస్కరా! ఫలము = గాఁబడి, అతిసూక్ష్మము + ఐనను = మిక్కిలిస్వల్పమైనను, నృపాలుఁడు = ప్రభువు, మంచి గుణాఢ్యుఁడు = ఎక్కుడుసుగుణములు కలవాఁడు, ఐనచోన్ = అయినట్లయిన, ఎలమిన్ = ఆనందముతో, వివేకులు = బుద్ధిమం తులు, ఆతనికిన్ = ఆప్రభువుపై, అపేక్ష = ప్రేమ, ఒనర్తురు = చూపుదురు, అది = ఆవిషయమై, ఎట్లు = ఉదాహరణమేమ నఁగా- చకోరములు = వెన్నెలలోనానందించు చకోరపక్షులు, చంద్రికావిలసనము, చంద్రికా = వెన్నెలయొక్క, విలసనము =

వెలుతురు, ఐనన్ = మాత్రమె, తాము = ఆపక్షులు, అనుభ వింపఁగ = అనుభవించుటకు, చలువ = శీతలస్వభావము, కల + అట్టివాఁడు = కలిగినటు వంటివాఁడు, అగుటఁగ = అగుటచేతనే కదా, ఎంతయుఁగ = మిక్కిలి, ఆసఁగ = ఆశతో, చందురున్ = చంద్రునిగుఱించి, చేరవే = వెన్నెలలోనికిఁ బ్రవేశింపవా.

తాత్పర్యము. సత్ప్రభుపరిపాలనములోఁ దమకు లాభము తక్కువైనను జను లాప్రభువును మిగులఁ బ్రేమింతురు. చంద్రుఁడు చల్లనివాఁ డగుటమాత్రముచేతనేకదా. చకోరపక్షులు వెన్నెలలోఁ దమకుఁ గడుపునిండ వస్తువుదొరకపోయినను జేరి యానందించుచున్నవి.

ఉ. బంధుర సద్గుణాఢ్యుఁ డొకపట్టున లంపటనొందియైన దు
స్సంధి దలంపఁ డన్యులకుఁ జాలహితం బొనరించుఁగాక శ్రీ
గంధపుఁజెక్క రాగిలుచుఁగాదె శరీరుల కుత్సవార్థమై
గంధము లాత్మఁ బుట్టఁ దఱుగంబడి యుండుటలెల్ల భాస్కరా.

టీక. భాస్కరా! బంధురసద్గుణాఢ్యుఁడు = బంధుర = చక్కని, సత్ + గుణ + ఆఢ్యుఁడు = మంచి, గుణములు, గలవాఁడు, ఒకపట్టునన్ = ఒక్కసమయమందు, లంపటన్ = కష్టమును, ఒందియైనఁగ = పొందియున్నైనను, అన్యులకుఁగ = ఇతరులకు, చాలఁగ = మిక్కిలి, హితంబుఁగ = ఉపకారమును, ఒనరించుఁగ = కావించును, కాక = అట్లుకావింపక, దుస్సంధిఁగ = అపకారమును, తలంపఁడు = చేయఁబోఁడు. ఉదాహరణము- శ్రీగంధపు + చెక్క = మంచిగంధపుచెక్క, రాగిలుచున్ =

అనుమతించుచు, గంధములు=పరిమళమును, ఆత్మన్=తన లోపల, పుట్టన్=కలుగునట్లు, తఱుగంబడి=చెక్కలుచేయఁబడియఱగఁదీయఁబడి, ఉంచుటలు + ఎల్లన్=ఉంచుటయను నది, శరీరులకున్=శరీరములుగల సమస్తమైనవారికిని, ఉత్స వ + అర్థము + కాదె=ఆనందము గలిగించు, నిమిత్తమే, కాదా.

తాత్పర్యము. సుగుణశాలియైనవాఁడు తాను శ్రమపడియైనను బరులకు మేలుచేయుటకే యత్నించును గాని కీడు చేయఁజూడఁడు. మంచిగందపుఁజెక్క తా నఱిగిపోయియైనను లోకులకెల్ల నానందమును గలిగించుచుండుటలేదా. అదియెవ్వరికైన దుఃఖమును గల్గించుచున్నదా.

చ. బలము దొలంగుకాలమునఁ బ్రాభవసంపద లెంతధన్యుఁడు
న్నిలుపుకొనంగ నోపడదినిశ్చయ; మర్జునుఁ డీశ్వరాదులన్
గెలిచినవాఁడు బోయలకుఁ గీడ్పడిచూచుచుఁగృష్ణుభార్యలం
బలువురనీయఁడే నిలువఁబట్ట సమర్థుఁడుగాక భాస్కరా. 23

టీక. భాస్కరా! బలము=శక్తి, తొలఁగుకాలమునన్=పోవుటకు సిద్ధమైనకాలమున, ఎంతధన్యుఁడున్=ఎంతటి గొప్పవాఁడును, ప్రాభవసంపదలు=తన ప్రభుత్వగౌరవమును, నిలుపుకొనంగన్ + చాలఁడు=నిలువఁబెట్టుకొనుటకు సమర్థుఁడు కానేరఁడు, అది=ఆవిషయము, నిశ్చయమె=రూఢియైనదియే. ఉదాహరణము- ఈశ్వర + ఆదులన్=శివుఁడు, మొదలైనవారలను, గెలిచినవాఁడు=ఓడించినట్టి, అర్జునుఁడు=పాం

డవమధ్యముఁడు, బోయలకుఁ=కిరాతులకు, కీడ్పడి=లోంగి, చూచుచున్=ఏమియుఁజేయలేక, కృష్ణుభార్యలఁ=శ్రీకృష్ణుని పెండ్లములను, నిలువఁ+పట్టఁ=బోయలనుండి తెచ్చి నిల్పుటకు, సమర్థుఁడుకాక=శక్తిచాలక, పలువురఁ=చాల మంది స్త్రీలను, ఈయఁడే=బోయలకువశముచేయలేదా.

తాత్పర్యము. ఐశ్వర్యము తొలంగి పోవుచున్నకాలములో నెంతటివాఁడైనను విధిని నిలుపఁజాలఁడు. అతనిశక్తి యెంతమాత్రమును దైవముకడఁ బనిచేయదు. ఈశ్వరాదులను గెల్చిన యర్జునుఁడు దైవబలము తగ్గినకాలములో కృష్ణభార్యలను దోఁచుకొనుచున్న బోయల నేమియుఁ జేయలేక చూచుచు మిన్నకుండలేదా.

చ. బలయుతుఁడైనవేళ నిజబంధుఁడు తోడ్పడుఁగాని యాతఁడే
బలము తొలంగెనేని తనపాలిటి శత్రు; వదెట్లు పూర్ణుఁడై
జ్వలనుఁడు కానఁగాల్చుతఱిసఖ్యముచూపునువాయుదేవుఁడా
బలియుఁడుసూక్ష్మదీపమగుపట్టునవార్పదెగాలిభాస్కరా. ౭౪

టీక. భాస్కరా! బలయుతుఁడు=బలముతోఁగూడినవాఁడు, ఐనవేళఁ=అయినట్టిసమయమున, నిజబంధుఁడు=తన చుట్టము, తోడ్పడుఁ+కాని=సాయముచేయునుగాని, ఆతఁడే=ఆబలయుతుఁడే, బలము=శక్తిని, తొలంగెనేని=పోఁగొట్టుకొనినయెడల, తనపాలిటిశత్రువు=తనవిషయములో విరోధి యేయగును, అది+ఎట్లు=బంధువే విరోధియగుట యెట్లనఁగా. ఉదాహరణము. జ్వలనుండు=అగ్నిహోత్రుఁడు, పూ

ర్ణుఁడై = నిండుగా ప్రజ్వరిల్లి, కానన్ = అడవులను, కాల్చుతఱిఁ = తగులఁబెట్టునప్పుడు. వాయుదేవుఁడు = సమీరుఁడు, సఖ్యము = మైత్రిని, చూపును = కనఁబఱచును, ఆబలియుఁడు = ఆయగ్నిహోత్రుఁడే, సూక్ష్మదీపము = చిన్నదీపము, అగుపట్టునన్ = అయినప్పుడు, గాలి = ఆవాయుదేవుఁడే, ఆర్పదే = చల్లార్చుటలేదా.

తాత్పర్యము. బలవంతుఁడై యున్నపుడే యెవ్వరికైన వారిబంధువులు సాయముచేయుదురు. బలము తగ్గియున్నపుడు వారికాబంధువులే వైరులగుదురు. అడవిని దహించుచున్నపుడగ్నికి సహాయముచేసిన గాలియే, ఆయగ్ని చిన్నదీపముగా నున్నపుడు, ఆర్పుటకు సిద్ధమగుటలేదా.

ఉ. బల్లిదుఁడైన సత్ప్రభుఁడు పాయకయుండినఁగాని రచ్చలోఁ
జిల్లరవారు నూఱుగురు చేరినఁ దేజము గల్గదెయ్యెడం
జల్లనిచందురుం డెడసి సన్నపుఁజుక్కలు కోటియున్న రం
జిల్లునె వెన్నెలన్ జగముచీఁకటులన్నియుఁ బాయ భాస్కరా.

టీక. భాస్కరా! బల్లిదుఁడు = బలముగలవాఁడు, ఐన సత్ప్రభుఁడు = అయినట్టి మంచియధికారి, రచ్చలోఁ = సభామధ్యమున, పాయక = విడువక, ఉండినన్ + కాని = ఉండిననేకాని, చిల్లరవారు = ఇతరులు, నూఱుగురు = అనేకులు, చేరినఁ = సభలోనుండినను, ఎయ్యెడన్ = ఎక్కడను, తేజము = శోభ, కలుగదు = ఉండదు. ఉదాహరణము- చల్లనిచందురుండు = శీతస్వభావముగల చంద్రుఁడు, ఎడసి = మాటుపడి, సన్న

పు + చుక్కలు = సూక్ష్మనక్షత్రములు, కోటి = అనేకము, ఉన్నన్ = ఉండినను, చీకటులు = అంధకారములు, అన్నియున్ = సమస్తమును, పాయఁగ = నశించునట్లు, వెన్నెలల్ = చంద్రకాంతులు, రంజిల్లునె = ఒప్పునా.

తాత్పర్యము. దక్షుఁడైన సభాధిపతి యుండకున్నచోఁ బలువురు సభ్యులున్నను సభ రాణింపదు. చంద్రుఁడు లేనపుడు చిన్నచిన్న నక్షత్రము లెన్నియున్నను వెన్నెలలు బైలుదేఱి చీఁకట్లను బోఁగొట్టఁగలవా. లోకము రంజిల్లునా.

చ. భుజబలశౌర్యవంతులగు పుత్రులఁ గాంచినవారి కెయ్యెడ
న్నిజహృదయేప్సితార్థములు నిక్కము చేకుఱుఁ; గుంతిదేవికిన్
విజయబలాఢ్యుఁ డర్జునుఁడు వీరపరాక్రమ మొప్ప దేవతా
గజమును దెచ్చి తల్లివ్రతకార్యముఁ దీర్పఁడె తొల్లి భాస్కరా.

టీక. భాస్కరా! భుజబలశౌర్యవంతులు = భుజముల సామర్థ్యమును, శూరత్వమునుగల్గినవారు, అగుపుత్రులు = ఐన కుమారులను, కాంచినవారికిన్ = కన్నతల్లిదండ్రులకు, ఎయ్యెడన్ = ఎక్కడనైనను, నిజహృదయేప్సితార్థములు, నిజ = తమ యొక్క, హృదయ = మనస్సులలోఁ గలిగిన, ఈప్సిత = కోర్కెలయొక్క, అర్థముల్ = ప్రయోజనములు, నిక్కము = సత్యముగా, చేకుఱున్ = లభించును. ఉదాహరణము. తొల్లి = పూర్వకాలమున, కుంతిదేవికిన్ = కుంతియను పాండురాజభార్యకు, విజయబలాఢ్యుఁడు = జయస్వభావముగల బలముతోఁ గూడిన, అర్జునుఁడు = కుంతికుమారుఁడు, వీరపరాక్రమము = బలశాలు

లకుఁడగినకార్యము, ఒప్పన్ = తగినట్లు, దేవతాగజమును = దేవ గలయేనుఁగును (ఐరావతమును) తెచ్చి = స్వర్గమునుండి తీసికొనివచ్చి, తల్లివ్రతకార్యము, తల్లి = కుంతియొక్క, వ్రత = ఐరావత వ్రతముయొక్క, కార్యమున్ = పనిని, తీర్పఁడె = పూర్తి చేయఁడా.

తాత్పర్యము. బలవంతులైన కుమారులు గలతల్లిదండ్రులకు వారికోర్కెలు తీరుటలో వింతలేదు. బలపరాక్రమములు గలయర్జునుఁడు కొమరుఁడగుటచేతనేకదా కుంతీదేవి వ్రతము పరిపూర్ణముచేయుటకై యర్జునుఁడు స్వర్గమునుండి యైరావతమను దెల్లయేనుఁగును దెచ్చినాఁడు. (ఐరావతవ్రతము కలదు. దానినోమువారు ఐరావతమువలె మన్నుతోను బంగారుమొదలగు లోహములతోను జేసికొందురు. దుర్యోధనాదులు గాంధారివ్రతమునకై మట్టియేనుఁగును జేసిరి. కుంతివ్రతమునకై అర్జునుఁడు ఇంద్రునివద్దికి తెల్లయేనుఁగునే తెచ్చియిచ్చెనని భారతకథకలదు.)

౭. భూనుతులైనదేవతలు పూర్వము కొందఱు వావివర్తనల్ మాని చరింపరో యనుచు మానవు లట్లు చరింపఁబోల దం భోనిధు లన్నియుం దనదుపుక్కిటఁ బట్టె నగస్త్యుఁ డంచునా పూనికకెవ్వఁడోపు నదిపూర్వమహత్త్వమునుమ్మభాస్కరా.

టీక. భాస్కరా! భూనుతులు = భూజనులచేతఁ గొనియాడఁబడువారు, ఐనదేవతలు = అయినట్టిదివ్యులు, కొందఱు = కొంతమంది, పూర్వము = పూర్వయుగములందు, వావివర్తనలు =

వావి=ఇదియక్క,యిదిచెల్లెలు,అనువావులు,వర్తనలు=ఆచారములు(నడవళ్లు), మాని=ఆలోచింపక, చరింపరో=సంచరింపరేదా,అనుచుఁ=అనుకొని(వారివర్తనలుమనస్సులోఁబెట్టుకొని) మానవులు=కలికాల మనుష్యులు, అట్ల=ఆదేవతలవలెనే, చరింపఁ=వారివర్తలను మానిచరించుట, పోలదు=యుక్తముగాదు. ఉదాహరణము. అగస్త్యుఁడు=ఒకసమర్థుడగుముని, అంభోనిధులు + అన్నియుఁ=(అంభః=నీళ్లకు, నిధులు=నివాసములు) సముద్రములు, అన్నింటిని, తనదుపుక్కిటఁ= తనపుక్కిలింతకు సరిపడునట్లు, పట్టెన్ + అంచుఁ=బుగ్గను బెట్టుకొన్నాఁడని, అపూనికకుఁ=అవిధముగ, చేయుటకు ఎవ్వఁడు=ఏమానవుఁడు, ఓపుఁ=సమర్థుఁడగును? అది= ఆసముద్రములనుపుడిసిలించుట, పూర్వమహత్త్వముసుమ్మీ= పూర్వకాలపుమహాత్ములు చేయునద్భుతకార్యములుసుమా.

తాత్పర్యము. తొల్లింటివా రెవ్వరో మహాత్ములు మనకు నిందార్హములుగా నున్నకార్యములను జేసినారుగదా యని మనము వారుచేసినపనినే యాదర్శముగాఁ బెట్టుకొని యట్లే చేయుటకుఁ దొడఁగఁగూడదు. మనము నిర్వహింపలేము. సముద్రములను అగస్త్యుఁడాచమనముక్రిందఁ ద్రాగివైచినాఁడని మన మావిధముగాఁ జేయఁగలమా. సముద్రమువలదు. చెంబెఁడునీళ్ళు నోటఁబోసికొనఁగలమా అది పూర్వకాలచర్య మనకు సాధ్యముకాదు.

ఉ. భూపతికాత్మబుద్ధి మదిఁబుట్టనికోలఁ బ్రధానులెంత ప్ర
జ్ఞాపరిపూర్ణులైన నొనసాగదు కార్యము; కార్యదక్షులై
యోపిన ద్రోణ భీష్మకృపయోధు లనేకులు గూడి కౌరవ
క్ష్మాపతికార్యమేమయినఁ జాలిరె చేయఁగవారుభాస్కరా.

టీక. భాస్కరా! భూపతికిన్ = ప్రభువునకు, ఆత్మబుద్ధి = సహజమైనయూహ, మదిన్ = హృదయములో, పుట్టనికోలన్ = కలుగకున్నపుడు, ప్రధానులు = మంత్రులు, ఎంత ప్రజ్ఞాపరిపూర్ణులైనన్ = ఎటువంటి నేర్పరులైనను, కార్యము = చేయఁదలఁచుకొనినపని, కొనసాగదు = నెఱవేఱదు. ఉదాహరణము. కార్యదక్షులు + ఐ = పనిచేయుటలో సమర్థులై, ఓపిన = శక్తులైన, ద్రోణ, భీష్మ, కృప, యోధులు = ద్రోణుఁడు, భీష్ముఁడు, కృపుఁడు మొదలగువీరులు, అనేకులు = చాలమంది, కూడి = చేరి, కౌరవక్ష్మాపతి కార్యము = దుర్యోధనునిపనిని, ఏమయినన్ = కొంచెమైనను, చేయఁగన్ = చేయుటకు, చాలిరె = శక్తిగలవారయిరా?

తాత్పర్యము. రాజున కిష్టములేని పనిని నెఱవేర్చుటకుఁ బ్రధాను లెంతయత్నముచేసినను వారివలన గార్యము సాధ్యము కానేరదు. దుర్యోధనున కిష్టములేని పాండవసఖ్యమును భీష్ముఁడు ద్రోణుఁడు మొదలగు యోధవీరులెంతమంది యుండియు ను జేయఁగలిగినారా ?

ఉ. భూరిబలాఢ్యుఁడైనఁ దలపోయక విక్రమశక్తిచే నహం
కారమునొందుటల్ తగవుగా దతఁ డొక్కఁడె మోసపోవుఁగా;

వీరవరేణ్యుఁడర్జునుఁడు వింటికి నేనధికుండ నంచుఁ దా
నూఁకవింటి నెక్కుడఁగనోపఁడు కృష్ణుఁడు లేమిభాస్కరా. 79

టీక. భూరిబలాఢ్యుఁడు + ఐనన్ = విస్తారము బాహు బలము కలిగినవాఁడయినను, గెలుపోయక = వెనుకముందు లాలోచింపక, విక్రమశక్తిచేన్ = శౌర్యబలముచే, అహంకారమున్ = గర్వమును, ఒందుటల్ = పొందుట, తగవుకాదు = సరికాదు, అతఁడు = ఆయహంకారమునొందినవాఁడు, ఒక్కడన్ = ఏదైన నొక్కతావున, మోసపోవున్, కా = పరాజయముకల్గును చుమా. ఉదాహరణము. వీరవరేణ్యుఁడు = శౌర్యవంతులలో నగ్రగణ్యుఁడయిన, అర్జునుండు = పార్థుఁడు, వింటికిన్ = విలువిద్యయందు, నేను, అధికుండన్ = ఎక్కువనేర్పుగలవాఁడను, అంచున్ = అనిచెప్పుచు, కృష్ణుఁడు లేమిన్ = కృష్ణమూర్తిచనిపోయినపిమ్మట, ఊఁకన్ = శక్తిలేక, వింటిన్ = ధనువును, ఎక్కుడఁగన్ = ఎక్కుపెట్టుటకు, ఓపఁడు = సామర్థ్యములేనివాఁడయ్యెను.

తాత్పర్యము. నేను బలవంతుఁడ నని యెంతవాఁడును గర్వపడరాదు. ఏదోనమయమున పరాభవము రాకమానదు. విజయుఁ డనుపేరుపొందిన యర్జునుఁడు కృష్ణమూర్తి లేనియపుడు (చనిపోయినపిమ్మట) విల్లెక్కుపెట్టుటకైన శక్తిలేనివాఁడై దొంగల కోడిపోలేదా.

ఉ. భ్రష్టుఁడకర్థవంతు లగుబాంధవు లెందఱు గల్గిన న్నిజా
దృష్టములేదు గావున దరిద్రత బాపఁగలేరు సత్కృపా

దృష్టిని నిల్పి లోకుల కతిస్థిరసంపద లిచ్చులక్ష్మియా
జ్యేష్ఠున కదేటికిం గలుగఁ జేయదు తోడనె పుట్టి భాస్కరా. ౮౦

టీక. భాస్కరా! భ్రష్టునకున్ = చెడ్డవానికి, అర్థవంతులు = ధనికులు, (అర్థము = ధనము, అర్థముగలవారు అర్థవంతులు) అగు బాంధవులు = ఆ యుబంధువులు. కల్గినన్ = ఉన్నప్పటికిని, నిజ + అదృష్టము = తనయొక్క దైవలిఖితము, లేమకావున్ = లేకపోవుటచేత, దరిద్రు = ఆ చెడ్డవానిదారిద్ర్యమును, పాపఁగలేరు = ఆధనికులు తొలఁగింపలేరు. ఉదాహరణము. లోకులకున్ = జనులందరికిని, నతికృపాదృష్టిని = మిగులదయగలచూపును, నిల్పి = ప్రసరింపఁజేసి, అతిస్థిరసంపదలు = ఎన్నఁడును జెడనిభాగ్యములను, ఇచ్చు = దయచేయునట్టి, లక్ష్మి = సంపదలకు దేవతయైన లక్ష్మీదేవి, ఆజ్యేష్ఠునకున్ = ఆపెద్దమ్మవానికి, తోడనెపుట్టి = చెల్లెలై యుండియు, అదేటికిన్ = అది యేమికారణమున, కలుగఁజేయదు = సంపదగలిగింపక పోవుచున్నది.

తాత్పర్యము. చెడ్డగుణముగల దరిద్రునకు సంపన్నులగు బంధువు లున్నను ఆదరిద్రుని లేమిని తొలఁగింపఁజాలరు. పెద్దమ్మవానికి లక్ష్మీదేవి తోఁబుట్టువై యున్నను, ఆమెకు సంపదఁ గలిగించుటకు లక్ష్మి యేమి చేసినది? లోకములో నందఱను ధనికులను జేయులక్ష్మి తనయక్కకు ధన మీయలేకపోయినా. ఆమె గుణములనుబట్టి తనచెల్లెలై నను నుపేక్ష చేసినది. అదృష్టము చాలని పేదవాని కెట్లు మంచిస్థితి వచ్చును.

చ. మదిఁ దను నాసపడ్డ యెడ మంచిగుణోన్నతుఁ డెట్టిహీనుని
న్వదలఁడు మేలుపట్టున నవశ్యము మున్నుగ నాదరించుఁగా;
త్రిదశవిమానమధ్యమునఁ దెచ్చి కృపామతి సారమేయము
న్మొదలనిడండె ధర్మజుఁడు మూఁగి సురావళి చూడ భాస్కరా.

టీక. భాస్కరా! మంచిగుణోన్నతుఁడు=సుగుణశాలి యైనవాఁడు, తనున్=తన్ను, మదిన్=భావములో, ఆసపడ్డన్=అపేక్షించినయెడల, ఎట్టిహీనునిన్=ఎంతనీచునైనను, వదలఁడు=విడిచిపెట్టఁడు, మేలుపట్టునన్=మంచిసమయము సమకూడినపుడు, అవశ్యమున్=తప్పకుండ, మున్నుగాన్=అందరికంటె మొట్టమొదట, ఆదరించున్ + కా=మర్యాదచూపును గదా. ఉదాహరణము- ధర్మజుఁడు=ధర్మరాజు, కృపామతిన్=దయాస్వభావముతో, సారమేయమున్=కుక్కను, తెచ్చి=తీసికొనివచ్చి, సురావళి=దేవతా సమూహము, మూఁగి=కూడుకొని, చూడన్=చూచుచుండఁగా, త్రిదశ, విమాన, మధ్యమునన్=దేవతలు తెచ్చిన తన్నెక్కుమనిన విమానముమీఁద, మొదలన్=తనకంటెముందు, ఇడండె=ఎక్కింపఁడా.

తాత్పర్యము. సజ్జనుఁడు తన్నాశ్రయించుకొని నమ్మియున్న యెట్టినీచునైనను తనకు గౌరవము రాఁబోవునపుడు తనకంటెఁ దన్నాశ్రయించినవానికే ముందు గౌరవము చేయింపఁజూచును. పూర్వము ధర్మరాజు తనవెంటవచ్చి తనతమ్ములును భార్యయు విడిచినను తాను విడువని కుక్కను తనతోనమై దేవతలు తెచ్చిన విమానముపై నెక్కింపలేదా.

౩. మాటలకోర్వఁజాలఁ డభిమానధనుండు ప్రాణహాని యౌ
నోటులనైనఁ దానెదురుచూచుచునుండుఁ గొలంకులోపలన్
నీటమునింగినప్పు డతినీచములాడిన రాజరాజు పో
రాటమొనర్చి నేలఁబడఁడా మొన భీముని చేత భాస్కరా. ౮౩

టీక. భాస్కరా! అభిమానధనుండు = మిక్కిలి యభిమానశాలి యైనవాఁడు, ప్రాణహాని = ప్రాణాపాయము, ఔనోటులనైనన్ = కలుగఁబోవుచున్నట్టులైనను, తాన్ = తాను, ఎదురుచూచుచునుండున్ = ప్రాణహానికైన నెదురుచూచును గాని, మాటలకున్ = ఇతరులనెడు నిందావాక్యములకు, ఓర్వఁజాలఁడు = సహింపనోపఁడు. ఉదాహరణము- రాజరాజు = సుయోధనుఁడు, కొలంకులోపలన్ = ద్వైపాయనమను మడుగులో, మునింగినప్పుడు = నీళ్లలోఁగనఁబడక యున్న సమయమున, అతినీచములు = పాండవులు మిగుల హీనములగు మాటలను, ఆడినన్ = పల్కినందున, పోరాటము + ఒనర్చి = యుద్ధము చేసి, భీముని చేతన్ = భీమసేనుని చేతిలో దెబ్బలుతిని, నేలన్ = భూమిపై, పడఁడు + ఆయెనే = పడిచావలేదా. మాటలకోర్వక చచ్చుటకై బైటికివచ్చెనుగదా.

తాత్పర్యము. అభిమానము గలవాఁడు ప్రాణమైనఁ బోఁగొట్టుకొనును గాని మాటలు పడఁజాలఁడు. దుర్యోధనుఁడు మడుగులో దాఁగియున్నపుడు ధర్మరాజు పోటుమాటలాడినఁ దాళఁజాలక బైటికివచ్చి భీముని గదాఘాతముచేతఁ జావలేదా.

ఉ. మానవనాథుఁ డాత్మరిపు మర్మ మెఱింగిన వానినేలినం
గానిజయింపలేఁ డరులఁ; గార్ముకదక్షుఁడు రామభద్రుఁడా
దానవనాయకున్ గెలువఁ దా నెటులోపుఁ దదీయనాభి కా
స్థానసుధ న్విభీషణుఁడు దార్కొని చెప్పకయున్న భాస్కరా.

టీక. భాస్కరా! మానవనాథుఁడు=నరపతి, ఆత్మ, రిపు, మర్మము=తన, విరోధియొక్క, గుట్టు, ఎఱింగిన వానిన్=తెలిసియున్న బంటును, ఏలినంగాని=తనకొలువులోనుంచుకొని పోషించిననేకాని, అరులన్=విరోధులను, జయింపలేఁడు=గెలువఁజాలఁడు. ఉదాహరణము-కార్ముకదక్షుఁడు=ధనుర్విద్యలోనిపుణుఁడైన, రామభద్రుఁడు=శ్రీరాముఁడు, (తాను) తనతో విభీషణుఁడు=తానుపోషించుచున్న రావణునితమ్ముఁడు, దార్కొని=దగ్గఱకువచ్చి, తదీయ, నాభికాస్థాన, సుధన్=ఆరావణుని, బొడ్డులో, అమృతమున్నదని, చెప్పకయున్నన్=తనశత్రువుయొక్కగుట్టును చెప్పకపోయినయెడల, ఆదానవనాయకున్=రాక్షసరాజైన రావణుని, గెలువన్=ఓర్చుటకు, ఎటులు + ఓపున్=ఏవిధముగానేర్చును.

తాత్పర్యము. రాజు తనకొలువులో విరోధులగుట్టు దెలిసినబంటులను పెట్టుకొనకున్న వైరులను గెలువజాలఁడు. రామునివంటివానికి విభీషణుఁడు దగ్గఱనుండి రావణునినాభిలో నమృతకలశ మున్నదని తెల్పకపోయినయెడల నతఁడు రావణుని గెలువఁగలఁడా.

ఉ. మానవుఁ డాత్మకిష్టమగుమంత్రజపమాచరించుచోఁ
గానక యుబ్బుఁదార్కొని ... గాడని యర్కుని వాని వర్కుఁడై

మానఁగఁ జూడఁ డాపని; సమంచితభోజనవేళ నీఁగ తా
లూనిన వంటకంబు దినకుండఁగ నేర్పగునోటుభాస్కరా.౮౮

టీ. భాస్కరా! మానవుఁడు, ఆత్మకున్=తనప్రాణ యముసకు, ఇష్టము+అగు=నచ్చిన, మంచి ప్రయోజన ము=సత్కార్యము, ఆచరించు చోన్=చేయుటకు సిద్ధపడిన పుడు, కానక=విచారింపక, అల్పుఁడు=నీచుఁడు, ఒక్కఁడు= ఒకానొకఁడు, అది=అసత్కార్యము, కాదు, అని=మంచిది కాదని, పల్కినన్=చెప్పినయెడల, వానివల్కు పై=అనీచుని మాటపై, ఆపనిన్=తానుచేయు మంచిపనిని, మానఁగన్+ చూడఁడు=నిల్పుచేయఁబోఁడు. ఉదాహరణము. సమంచిత భోజనవేళ=రుచిరమయిన దివ్యభోజనము చేయుసమయమందు, ఈఁగ కా, లూనిన, వంటకంబు=ఈఁగ వ్రాలిన యన్నమును, తినకుండఁగన్=భుజింపకయుండుట, నేర్పు+అగు+ఓటు= అదిచేతనైనవాఁడు చేయుపనియగునా.

తాత్పర్యము. మనుష్యుఁ డొకఁడు చేయుచున్న చక్కని పనిలోఁ దప్పున్నదని మూర్ఖుఁ డొక్కఁడు చెప్పవచ్చినంతనె బుద్ధిమంతుఁ డాపని నెన్నఁడయిన మానునా. మంచివిందుభోజ నము చేయుచుండఁగా దానిమీఁదనీఁగ వ్రాలినదనిమొవ్వరయిన నారుచ్యపదార్థములను దినకుండ విడుచుచున్నారా.

౮. మానిని చెప్ప నెట్టిమాటలు విననట్టి వాఁడటు చేసిన నృశా కాంక్షఘటించు నేమియని కైవ సనంకటము పుట్టవాఁ గృపా

హీనత( బల్కినన్ దశరథేశ్వరు( డంగనమాటకై గుణాం
భోనిధి రాము( బాసిచనిపోవ(డె శోకమునొందభాస్కరా. ౭౫

టీక. భాస్కరా! ఎఱుకమాలినవాడు=బుద్ధిలేనిమనుష్యుడు, ఎట్లు=ఏప్రకారము, మానిని=అంగన, చెప్పన్=బోధించునో, అటు=అవిధముగనే, చేసినన్=చేసినయెడల, ఏఘనునికైనన్=ఎటువంటి యధికునకైనను, ఉర్విపైన్=లోకములో, మహాహాని=విశేషమైన చెఱుపు, ఘటించున్=కలుగును, అసంశయము=ఈవిషయమున నేమియుసందేహము లేదు. ఉదాహరణము- దశరథేశ్వరుడు=దశరథరాజు, కృపాహీనతన్=దయలేక, పల్కినన్=చెప్పగా (అడవికి రాముని బంపుమనిన) అంగనమాటకై=(భార్యయైన) కైకమాటలపై, గుణాంభోనిధిన్=సుగుణ సముద్రుడైన, రామున్=రామచంద్రుడను కొడుకును, పాసి=ఎడబాసి (అడవికిబంపి) శోకమునొందన్=విచారమునొంది, చనిపోవడే=మృతినొందలేదా.

తాత్పర్యము. అంగనచెప్పినట్లు విచారహీనుడై చేసినపనివలన నెంతటివానికైనను హాని కలుగును. పూర్వము కైక చెప్పిన మాటలపై దశరథుడు రాముని వనమునకుబంపి పుత్రశోకముచేత మరణింపలేదా.

చ. మును పొనరించు పాతకము మోహము జీవులకెల్లబూనియా
ననుపటి జన్మమం దనుభవింపక తీఱదు; రాఘవుండు వా
లిని బడనేసి తామగుడ లీలయదూద్భవుడై కిరాతుచే
వినిశితబాణపాతమున వీడ్కొనడే తనమేనుభాస్కరా. ౭౬

టీక. భాస్కరా ! మునుపు=వెనుకటిపుట్టువులో, ఒన
రించు, పాతకము=మనుష్యుఁడుచేసిన పాపము, అమోఘము=
నిష్ఫలమైపోదు, జీవులకున్=ప్రాణులకు, ఎల్లన్=అన్నిటికిని,
పూని=నడుముకట్టి, ఆ వెనుకటిజన్మమందు=మరలఁబుట్టఁబోవు
జన్మములో, అనుభవింపక=ఫలమనుభోగింపకుండ, తీఱదు=
మానఁబడదు. ఉదాహరణము- రాఘవుండు=రాముఁడు, వా
లిన్=వాలియను వానరరాజును, పడన్+ఏసి=పడఁగొట్టి,
తాన్=రాముఁడు, మగుడన్=తిరిగి, లీలన్=విలాసార్థము,
యదు+ఉద్భవుఁడు+ఐ=యాదవ వంశమందు, పుట్టిన
వాఁడై, కిరాతుచేన్=బోయవానియొక్క, విశిత బాణపాత
మునన్=తీక్ష్ణమైనశరముయొక్క పోటుచేత, తనమేను=తనశరీ
రము, వీడ్కొనఁడే=వదిలిపెట్టలేదా.

తాత్పర్యము. ఎవ్వరికైనను పూర్వజన్మకృతకర్మమును
(రెండవజన్మములో) అనుభవింపకుండ విడువదు. ఆజన్మములో
శ్రీరాముఁడు వాఁడిబాణమున వాలినిజంపిన కారణముననే
శ్రీకృష్ణావతారములో, బోయవానిబాణపాతిచే మరణింపవల
సివచ్చెను.

ఉ. రాకొమరుల్ రసజ్ఞునిఁ దిరంబుగ మున్న నుండినట్లు భూ
లోకమునందు మూర్ఖుఁ దమలోపల నుంపరు నిక్కమౌకదా
చేకొని ముద్దుగాఁ జదువు చిల్కను పెంతురుగాక పెంతురే
కాకము నెవ్వరైన శుభకారణవస్తువులెన్న భాస్కరా.౮౮

టీక. శుభకారిణ=మేలు కలుగఁజేయుటకు వాఁడా, సన్మునిసేవ్య=మంచిమునులచే సేవింపఁదగ్గవాఁడవగు, భాస్కరా! భూలోకమునన్=ఈజగములో, గ్రామణుల్=గ్రామముకు లు (సాధారణముగా రాజులు) సజ్జని=సాధుని, తిరంబుగన్= తమయొద్దనెల్లప్పుడు, మన్ననన్=మర్యాదతో, ఉంచినట్లు= ఉంచుకొనినరీతిగా, సూకుని=తెలివితక్కువవానిని, తమలో పలన్=తమకొలువులో, ఉంపరు=ఉంచుకొనరు, నిక్కమే కదా=నిజమే. ఉదాహరణము. ఎవ్వరైనన్=జనులెవ్వరు గాని, చేకొని=పట్టుకొని, ముద్దుగన్=చక్కఁగా, చదువు చిల్కను=చదువఁగల చిలుకపిట్టను, పెంతురుగాక=సాఁకుదు రుగాని, కాకమున్=పరుషముగా నఱచు కాకిని, పెంతురా= పెంచెదరా, సాఁకరు.

తాత్పర్యము. రసికులైన పండితులనే ప్రభువులు తమ యాస్థానములో నుంచుకొందురు గాని మూర్ఖులను దగ్గఱకు రానీయరు. ఎవ్వరయినను చక్కఁగా మాటలాడు చిలుకను పెంతురుగాని కావుకావుమను కాకిని పెంచెదరా.

ఉ. లోకములోన దుర్జనులలోఁతు నెఱుంగక చేరరాదు సు
శ్లోకుఁడు, చేరినంగవయఁజూతురు చేయుదురెక్కసక్కెముల్;
కోకిలఁగన్నచోటఁగుమిగూడియసహ్యపుఁగూఁతలార్చుచుం
గాకులు తన్నవేరితిమికాయముతల్లడమందభాస్కరా. ౮౮

టీక. భాస్కరా! లోకములోనన్=ఈజగములో సుశ్లోకుఁడు=సత్కీర్తిగలవాఁడు, దుర్జనుల లోఁతు=చెడ్డవారి

యొక్కనైజమును, ఎఱుంగక=తెలిసికొనక, చేరాను=వారితోఁగలియరాను, చేరినన్=కలిసినయెడల, కవయుచున్=ఆవరించుకొని, మూఁకురు=మూఁగుదురు, ఎక్కసక్కెముల్+చేయుదురు=ఎకసక్కెములాడుదురు (వెక్కిరింతురు) ఉదాహరణము. కాకుల్=వాయసములు, కోకిలన్=కోయిలపిట్టను, కన్నచోటన్=చూచినయెడల, గుమిగూడి=ప్రోగుగాఁగూడి, అసహ్యపు కూఁతలన్=సహింపరాని యఱపులతో, అర్చుచున్=కూఁతలుపెట్టుచు, కాయము=దానిశరీరము, తల్లడము+అందన్=తొట్రుపడునట్లుగా, తిత్తిమి=వెంటాడి, తన్నవే=ఎగిరితన్నవా.

తాత్పర్యము. సజ్జనుడు దుర్జనులసంగతి బాగుగా కనిపెట్టకుండ వారియొద్దకుఁ జేరఁగూడదు. చేరినయెడల చుట్టఁబెట్టుకొని ఎగతాళిచేయుదురు. కాకులు కోకిలను జూడఁగాని గుంపుగూఁడి చుట్టుబెట్టుకొని తిత్తిమి తన్ని దానిని నానాబాధలు పెట్టుటలేదా.

ఉ. లోనుదృఢంబుగాని పిసులోభినినమ్మి యసాధ్యకార్యముల్
కానకపూనునే సతఁడు గ్రక్కునఁ గూలును; నోటిపుట్టిపై
మానవుఁ డెక్కిపోవ నొకమాటబుడుంగున ముంపకుండునే
తానొకలోఁతుగాంగెడసి దానిఁదరింపఁగలేక భాస్కరా. ౮౯

టీక. భాస్కరా! లోను=లోపల, దృఢంబుగాని=దార్ఢ్యములేని, పిసులోభిని=అతిలుబ్ధుని, నమ్మి=విశ్వసించి, అసాధ్యకార్యముల్=సాధింపవలను పడని కార్యములను, కానక=

పూర్వాపరములు విచారింపక, పూనునేని = వానినే నమ్మి చేయు టకు మొదలు పెట్టిన యెడల, అతఁడు = ఆపని బూనినవాఁడు, గ్రక్కునన్ = తత్క్షణమె, కూలున్ = చెడిపోవును, మానవుఁడు = మనుష్యుడు = ఓటిపుట్టిపైన్ = (గట్టిలేని) బీఁటలుగల చిన్న తెప్పమీఁద, ఎక్కి = కూర్చుండి, పోవక = నీటిమీఁదఁ బ్రయాణము చేయఁగా, తాను = ఆ మోటిపుట్టి, ఒకలోఁతునన్ = లోఁతుగా నీరున్న తావున, కెడసి = విచ్చి, దానిన్ = ఆ లోఁతునీటిని, దాఁటలేక = తరింపఁజాలక, ఒకమాటు = ఒక్కమాఱు, బుడుంగునన్ = బుడుంగుమని, ముంపక = ఎక్కినవానిని ముంచివేయక, ఉండునే = ఉండఁగలదా.

తాత్పర్యము. ధైర్యసాహసములు లేనివానిని నమ్మి యెవ్వఁడయిన ఘనమైన పనికిఁ బూనుకొనెనేని యెక్కడనో యాపనికి విఘ్నము వచ్చి హానికలుగక మానదు. ఓటిపుట్టిలో నెక్కి నీటిమీఁదఁ బ్రయాణము చేసిన నేలోఁతునీళ్లలోనో వానిపుట్టి మునుంగకుండునా. (పుట్టియనఁగా వెదురుబద్దలతో, గుండ్రముగాఁ దొట్టికట్టి క్రిందఁ దోలుమూసిన యొక ప్లవము)

ఉ. వంచనయింతలేక యెటువంటి మహాత్ముల నాశ్రయించినం
గొంచెము గానిమేలు సమకూడ దదృష్టములేని వానికిన్;
సంచితబుద్ధి బ్రహ్మ ననిశంబును వీఁపున మోచునట్టి రా
యంచకు దుంపతూండ్లు దిననాయెఁ గదా ఫలమేమి భాస్కరా.

టీక. భాస్కరా! వంచన=మోసము, ఇంత=కొంచె
ముగూడ, లేక=లేకుండ, ఎటువంటి మహాత్ములన్=ఎంతటి
పెద్దవారిని, ఆశ్రయించినన్=చేరికొల్చినను, అదృష్టములేని
వారికిన్=దైవసహాయములేనివారికి, కొంచెమె కాని=స్వల్ప
మే కాని, మేలు=అధికము, సమకూడదు=దొరకదు. ఉదా
హరణము- సంచితబుద్ధిన్=కూర్పఁబడిన తెలివితో, అనిశంబు
ను=సర్వకాలమును, బ్రహ్మను=బ్రహ్మదేవుని, వీఁపునన్=
వెన్నుపై నెక్కించుకొని, మోచునట్టి, దాయంచకు=వహించుచున్న రాజహంసకు, ఫలము=లాభము, దుంపతూండ్లు=
తామరదుంప, తామరతూఁడును, తినన్ + అయెన్ + కదా=
తినుటయేగదా, విధింపఁబడినది.

తాత్పర్యము. అకృత్రిమస్వభావముతో నెంతటిమహాత్ములను సేవించినను విధివిహితము కానిలాభము విశేషముగా నెవ్వరికిని లభింపదు. అత్యంతభక్తిశ్రద్ధలతో బ్రహ్మదేవుని వీఁపున నెల్లప్పుడును మోయుహంసకు నియతము దుంప, తూఁడు మాత్రమే విధి దానికిభోజనముగా నియమించెనుగదా. అంతకెక్కుడు దొరకలేదు.

ఉ. వట్టుచుఁదండ్రి యత్యధమవర్తనుఁడైనను గాని వానికిం
బుట్టిన పుత్త్రకుండు తనపుణ్యవశంబున దొడ్డధన్యుఁడౌ;
నెట్టనమఱ్ఱివిత్తు మును పెంతయుఁ గొంచెము దానఁబుట్టునా
చెట్టుమహోన్నతత్వమును జెందదె శాఖలనిండి భాస్కరా.

టీక. భాస్కరా! తండ్రి=జనకుఁడు, వట్టుచున్=

రితుఁడై, అధమ వర్తనుఁడు=హీనవృత్తిని నొందినవాఁడు, ఐనను + కాని=అయినప్పటికి, వానికిన్=అతనికి, పుట్టిన=కలిగిన, పుత్రకుండు=కుమారుఁడు, తనపుణ్యావశంబునన్=వాని యదృష్టమువలన, దొడ్డధన్యుఁడు=అధికాదృష్టము గలవాఁడు (భాగ్యవంతుఁడును, ఘనుఁడును) ఔన్=కాఁగలఁడు, ఎట్టు + అనన్=ఏవిధముగాననఁగా. ఉదాహరణము. మఱ్ఱివిత్తు=మఱ్ఱిగింజ, మును=మొట్టమొదట, ఎంతయున్, కొంచెము=మిగులఁజిన్నది దానన్=అవిత్తుకొనుండి, పుట్టు=మొలచిన, ఆ చెట్టు=ఆమఱ్ఱిచెట్టు, శాఖలన్=కొమ్మలతో, నిండి=అలమి కొని, మహోన్నతత్వమున్=విస్తారముగా, ఎత్తుగాఁ బెరుఁగుటను, చెందదె=పొందదా.

తాత్పర్యము. అల్పుఁడు దరిద్రుఁడు నైనవానికిఁ బుట్టు పుత్త్రుఁడు వానియదృష్టవశమున గొప్పవాఁడును ధనికుఁడును గావచ్చును. మఱ్ఱిగింజమిక్కిలి యల్పమైనది యైనను దానిలో నుండి పుట్టిన చెట్టెంతపెద్దదిగాఁ బెరిఁగి యెట్లు వృద్ధినొందుచున్నదో యెఱుఁగుము.

చ. వలనుగఁ గానలందుఁ బ్రతివర్షమునుంబులి నాలుగైదు పి
ల్లలఁగనుఁదూడనొక్కటి నిలంగను ధేనువురెండుమూఁడు నే
డులకటులైన బెబ్బులి కుటుంబము లల్పము లాయెనాలమం
దలుగ సువృద్ధిఁజెందవె యధర్మముధర్మముఁ దెల్పభాస్కరా.

టీక. భాస్కరా! ఇలన్=భూమిలో, వలనుగన్=చక్కఁగన్, కానలందున్=వనములలో, పులి=వ్యాఘ్రము,

ప్రతివర్షమునన్ = తప్పకుండ, ప్రతిసంవత్సరమును, నాలుగు + ఐదు + పిల్లలన్ = నాలుగుగాని, అయిదుగాని, కూనలను, కనున్ = పెట్టును, ధేనువు = ఆవు, రెండు + మూఁడు + ఏడుల కున్ = రెండేండ్లకో, మూఁడేండ్లకో, దూడన్ + ఒక్కటిన్ = ఒక్కదూడనుమాత్రమే, కనున్ = ఈనును, అట్లైనను = అట్లు రెండేండ్లకు మూఁడేండ్లకు, ఒక్కదూడను బెట్టి నప్పటికిని, అధర్మమున్ = ధర్మవిరుద్ధమును, ధర్మమున్ = ధర్మయుతమును, తెల్పన్ = ప్రకటము చేయుటకు, బెబ్బులికుటుంబము = పులుల మందలు, అల్పములు + అయెను = కొంచెముగానున్నవి, అల మందలు = పసులమందలు, కడున్ = మిగుల, వృద్ధిచెందవె = అభివృద్ధియగుచున్నవిగదా, ఈపద్యములో మాత్రము సమాసమును గూర్పలేదు.

తాత్పర్యము. అడవులలోఁ గ్రూరస్వభావముగల పులి యేఁటేఁట నాలుగైదు పిల్లలను బెట్టుచున్నది. సాధుస్వభావము గలయావు గ్రామములలో రెండుమూఁడేండ్ల కొక్కదూడను బెట్టుచున్నది. స్థూలదృష్టికి పులులమందలే యెక్కుడుగాఁ బెరుఁగవలదా యని యనిపించును. కాని ధర్మము, నధర్మమును దెలుపుటకై యావులమందలే వృద్ధి యగుచున్నవి. పులుల మందలే తక్కువగుచున్నవి. ధర్మము పనికివచ్చును గాని యధర్మము పనికిరాదు.

చ: కలవడు క్రూరసంగతి, నవశ్యము తప్పును చేయఁబడ్డచోఁ
గొలఁదియైనఁ దక్కువలుగూడవు తుమ్మలపాలలోఁ బలం

గలసినసున్న మించుకయె కాక, మఱించుక, యెక్కువైనచో
నలుగడఁ జుఱ్ఱు చుఱ్ఱుమని నాలుక పొక్కకయున్నె భాస్కరా.

టీక. భాస్కరా! ప్రౌఢసంగతి=పెద్దవారితోస్నేహము, సలదు=చేయరాదు, అవశ్యము=వశముతప్పి, ఒక + అప్పుడు=విపుడైన, చేయఁబడ్డచోన్=చేయవలసివచ్చి స్నేహము చేసినయెడల, కొలఁదియెకాని=తత్కాలోచితముగ, కొంచెమేకాని, ఎక్కువలు=విస్తారము, కూడదు, చేయఁగూడదు. ఉదాహరణము. తమ్మలపాకు లోపలన్=తాంబూలదళము నకు, కలసినసున్నము=పూయఁబడినసున్నము, ఇంచుకయు + కాక=స్వల్పమేపూయఁబడవలయునుగాని, మఱి + ఇంచుక= ఇంకఁగొంత, ఎక్కువ + ఐనచోన్=ఎక్కువ పూయఁబడిన యెడల, నలుగడన్=నలుప్రక్కలను, చుఱ్ఱుచుఱ్ఱుమని= చుఱుచుఱుక్కుమనిమండి, నాలుక=జిహ్వ, పొక్కకయున్నె= పుండుపడకమానునా.

తాత్పర్యము. మంచివారికిఁ బెద్దవారితో జత కూడదు. అవసరమును బట్టి చేసినను గొంచెమే కాని విస్తారము గూడదు. తమ్మలపాకులకు సున్నము తగినట్లు కొంచెమే గాని యెక్కువ రాయఁగూడదు. ఎక్కువైన యెడల నాలుక పొక్కును.

ఉ. వానికి విద్యచేత సిరివచ్చె నటంచును విద్య నేర్వఁగాఁ
బూనినఁ బూనుఁగాక తనపుణ్యము చాలక భాగ్యరేఖ తాం
జానఁగ నెవ్వఁడోపు; నటపోఁ జెవిఁ బెంచునుగాక దృష్టతా
హీనుఁడు కన్నభాసము నెట్లు గణింపఁగనోపు భాస్కరా. ౯౨

టీక. భాస్కరా! వానికిన్=ఎదుటవానికి, విద్యచే తన్=చదువుకొన్న వాఁడగుటచేత, సిరి=ఐశ్వర్యము, వచ్చెను=కలిగెనుగదా, అటంచున్=అని, విద్యన్=చదువును, నేర్వన్+కాన్=అభ్యసించుటకు, పూనును+కాక=యత్నించునుగాని, తనపుణ్యము=తనఅదృష్టము, చాలక=తక్కువగుటవలన, భాగ్యరేఖకున్=ఆయెదుటివాని యైశ్వర్యవంటి యైశ్వర్యమును, పూనఁగన్=పొందుటకు, ఎవ్వఁడు+ఓపున్=సమర్థుఁడెవ్వఁడు. ఉదాహరణము.-(ఎదుటివాని చెవుల భూషణములను జూచి). సరిపోన్=అట్టిభూషణము పెట్టుకొన్న సరిపనుట్లు, చెవిన్=చెవికన్నమును, పెంచునుగాక=పెంపు చేయఁగలఁడుగాని, అదృష్టతాహీనుఁడు=అదృష్టములేనివాఁడు, కర్ణభూషణములు=అట్టిచెవిపోగులను, గణింపఁగన్=సంపాదించుకొనుటకు, ఎట్లు+ఓపున్=ఏవిధముగాసమర్థుఁడగును.

తాత్పర్యము. ఒక్కనికి విద్వాంసుఁడగుటచే ధనము దొరికినదని తాను జదివికొనుటకు విద్వాంసుఁడగుటకు యత్నించి కావచ్చునుగాని ధనము నెట్లు అదృష్టహీనుఁడు గడింపఁగలఁడు. ఒక్కరిచెవినున్న యంటుజోడువంటి జోడు కొఱకై తనచెవి కుట్లు పెంచినఁ బెంచును గాని దరిద్రుఁడా యంటుజోడు చేయించికొనఁగలఁడా.

ఉ. సంతతపుణ్యశాలి నొకజాడను సంపద వాసిపోయితా
సంతటఁబోక నెట్టుకొని యెప్పటియట్ల వసించియుండు మా

సాంతమునందుఁ జందురుని నన్నికళల్ పెడఁబాసి పోయినం
గాంతి వహింపఁడోటు తిరుగంబడి దేహమునిండభాస్కరా.

టీక. భాస్కరా ! సంతతపుణ్యశాలిక్ = విశేషపుణ్య
ముచేసికొన్నవానిని, ఒకజాడను = ఒకవిధముగా, సంపద = సిరి,
పాసిపోయి = విడిచిపోయి, తాన్ = ఆసంపద, అంతటన్ +
పోక = ఆపోయినట్లేపోక, నెట్టుకొని = స్థిరమయి, ఎప్పటియట్ల =
యథాస్థితిగా, వసించియుండును = వచ్చిమనుష్యుని యొద్దనిలిచి
యుండును. ఉదాహరణము. మాస + అంతమునందున్ = నెల
చివరను, చందురుని = చంద్రుని, అన్నికళల్ = అన్నికళను,
పెడన్ + పాసి = వదలి, పోయినన్ = పోయినను, తిరుగంబడి =
మరలఁదిరిగివచ్చి, దేహము నిండన్ = బింబమునిండుగా, కాం
తిన్ = కళను, వహింపఁడు + ఓటు = మరలఁ బొందుటలేదా.

తాత్పర్యము. పుణ్యాత్ముని కొక్కవేళ సంపద తొలఁగి
పోయినను గొన్నినాళ్లకు మరల వచ్చినా స్థిరమై యుండును.
అమవసకుఁ గళలన్నియుఁ బోయిన చంద్రునకుఁ బున్నమనాఁటికి
మరల నిండుగా నన్నికళలును వచ్చిచేరుటలేదా.

చ. సకల జనప్రియత్వము నిజంబుగఁ గల్గినపుణ్యశాలి కొ
క్కొకయెడ నాపదైనఁ దడవుండదు. వేగమెపాసిపోవుఁగా;
యకలుషమూర్తియైనయమృతాంశుఁడురాహువుతన్నుమ్రింగి
నందకటక మాదియుండఁడె దృఢస్థితినెప్పటియట్లభాస్కరా.

టీక. భాస్కరా! సకలజనప్రియత్వము = సమస్తజను
లను ప్రేమతోఁజూచుట, నిజంబుగ = వాస్తవముగ, కల్గిన =

ఉండిన, పుణ్యశాలికిన్=పుణ్యాత్మునకు, ఒక్క+ఒక్క+ఎడన్=ఒకానొకసమయములో, ఆపద=కష్టము, ఐనన్=సంభవించినను, తనవు=చిరకాలము, ఉండదు=నిల్చియుండనేరదు, వేగమే=శీఘ్రముగ, పాసిపోవునుగా=ఆకష్టము విడిచిపోవుచున్నదిగదా. ఉదాహరణము. అకలుషమూర్తి=నిర్మలమైనయాకారముగలవాఁడు, ఐనన్=అయినప్పటికి, అమృతాంశుఁడు=చంద్రుఁడు, తన్నున్+రాహువు=రాహువను గ్రహము, మ్రింగినన్=గ్రహణకాలమునందావరించినను, టకటక=అలజడిని, మాని=పొందక, దృఢస్థితిన్=దార్ఢ్యమును, ఎప్పటియట్ల=పూర్వరీతినే, ఉండఁడె=ఉండుటలేదా.

తాత్పర్యము. సజ్జనాదరమునకుఁ బాత్రుఁడైనవాని కొకప్పు డాపద వచ్చినను నది స్థిరముగా నుండదు. ఆపదలు కాఁపురముచేయవు. రాహుగ్రహ లావరించినపుడు చంద్రుఁడు కొంత శ్రమ పడినను అది తొలఁగినంతనె యథాస్థితికి వచ్చి పూర్ణతేజముతో నుండునుగదా.

ఉ. సన్నుతకార్యదక్షుఁడొకచాయ నిజప్రభ యప్రకాశమై
యున్నపుడైన లోకులకు నొండొకమే లొనరించు; శత్రుసం
పన్నుఁడు భీముఁడాద్విజులప్రాణముకావఁడె యేకచక్రమం
దన్నికగా బకాసురుని నేపున రూపడఁగించి భాస్కరా. ౯౨

టీక. భాస్కరా! సన్నుతకార్యదక్షుఁడు=సన్నుత=కొనియాడఁబడిన, కార్య=పనులయందు, దక్షుఁడు=సమర్థుఁడు, ఒకచాయన్=ఒక్కసమయమున, నిజప్రభ=తనకాంతి,

అప్రకాశమై=ప్రకటముకానిదై(కాంతిలేనిదై)ఉన్నప్పుడు+ ఐనన్=ఉండినప్పుడుగూడ, జనులకు, ఒండు+ఒక మేలు= శ్రీదైనవొక్కయుపకారమును, ఒనరించున్=చేయును. ఉదా హరణము- సత్త్వసంపన్నుఁడు=బలముతోఁ గూడినవాఁడగు, భీముఁడు=ధర్మరాజుతమ్ముఁడు, ఏకచక్రమందు=ఏకచక్ర పురమునందు, ఎన్నికగాన్=ప్రకటముగా, బకాసురుని= బకుఁడనురాక్షసుని, విక్రమముతో, రూపు+అడఁ గించి=చంపి, అద్విజులప్రాణములు=ఆబ్రాహ్మణకుటుంబ ము యొక్క ప్రాణములను, కావఁడె=రక్షింపలేదా.

తాత్పర్యము. సమర్థుఁడైనపురుషుఁడొక్కొక్కసమయ మందుఁ దేజోరహితుఁడై యున్నను పరోపకారబుద్ధిని విడిచి యుండఁడు. బలవంతుఁడైన భీముఁడు ఏకచక్రపురములో రహస్యముగా బిచ్చమెత్తుకొనుచున్నను బకాసురుని జంపి బ్రాహ్మణబాలుని గాపాడలేదా.

ఉ. పరసుగుణప్రపూర్ణునకు సన్నపు దుర్గుణ మొక్కవేళయం
దొరసిన నిట్లు నీకుఁ దగునో యని చెప్పిన మానునేర్పుఁగా
బరద రొకించుకంత తముఁబొందినవేళలఁ జల్లవిత్తుపై
బొరసిన నిర్మలత్వమున నుండదె నీరములెల్ల భాస్కరా. ౫౮

టీ. భాస్కరా! పరసుగుణప్రపూర్ణునకున్=సద్గుణము లచే శోభించువారికి, సన్నపుదుర్గుణము=కొంచెమైనయవగుణ ము, ఒక్కవేళయందున్=ఎప్పుడైనవొక్కప్పుడు, ఒరసినన్= పొడమియుండినను, ఇట్లు=ఈరీతి, నీకున్+తగునో=నీకుదగి

నదేనా (కాదు) అని, చెప్పినన్ = మందలించినయెడల, మాన నేర్చునె-కా = మానివేయఁగలఁడు. ఉదాహరణము- బురద = అడుసు, కాఱ-ఒంచుక = అది, కొంచెము, తమిన్ = నీళ్లను పొందినవేళన్ = కలసియున్నప్పుడు చిల్లపిత్తు = నీటిని విఱుచుట తకము (ఇండుపుగింజ) పైన్ = మీఁద, ఒరసినన్ = తగిలిన యెడల, నీరములు = నీళ్లు, ఎల్లన్ = అన్నియు, నిర్మలత్వమున్ = స్వచ్ఛతనుగలిగి, ఉండవె = ఉండుటలేదా.

తాత్పర్యము. మనుజుడు సమయభేదముచే నేదే నొక దుర్గుణము కలిగినను దాని నది నీకుఁ దగదని యెవ్వరైనఁ జెప్పిన మానివేయఁగలఁడు. వానకాలములోఁ గలుషమైన నీళ్లు కొంచెము చిల్లగింజరసము తగిలినా నిర్మల ముగుట లేదా.

చ. సరసద యాగుణంబుగల జాణ మహింగడు నొచ్చియుండి యుం
డఱుముగ వానికానపడి దాయఁగ వత్తురు లోకు లెట్లనం
జెఱకురసంబు గానుఁగును జిప్పిలి పోయినమీఁదఁ జిప్పయై
ధరఁబడియున్నఁ జేరి వెముదంబునఁ జీమలు పెక్కు భాస్కరా.

టీక. భాస్కరా! మహిన్ = లోకమునో, సరసదయా గుణంబు = చక్కనదయ యనుగుణము కలజాణ = కల్గిననేర్పు గలవాఁడు, కడున్ = మిక్కిలి, నొచ్చియుండినన్ = నొగిలియున్నను, తఱుచుగన్ = విస్తారముగ, లోకులు = జనులు వానికిన్ = అదయగలవానికి, అనపడి = అనించి, దాయఁగన్ వత్తురు = సమీపించుటకు వచ్చెదరు. ఉదాహరణము- గానుగన్ = చెఱకుగానుగలో, చెఱకురసంబు = ఇక్షురసము, చిప్పిలిపోయి

నన్ = అంతయుఁ బిండఁబడినను, (కాఁచిపోయినను) మీఁదన్ = పైని, పిప్పియై = చెత్తయై, ధరన్ = భూమిపై, పడియున్నన్ = క్రిందఁబడియున్నప్పటికి, పెక్కు = చాల, చీమలు = పిపీలికలు, ముదంబునన్ = ఆసక్తితో, చేరవె = చుట్టుకొనవా.

తాత్పర్యము. దయగలదాత యొకప్పుడు నిర్ధనుఁడైనను జనులు వానినే యాసించి యడుగవత్తురు. గానుఁగులోఁ జెఱకునందుఁ గలరసము సర్వము వడిసిపోయినను చెఱకుచెత్తకై చీమలు పెక్కు చేరుటలేదా.

ఉ. సారవివేకవర్తనల సన్నుతికెక్కినవారి లోపలం
జేరినయంత మూఢులకుఁ జేపడ దానడ యెట్టులన్నఁగా
సారములోన హంసములసంగతి నుండెడి కొంగపిట్ట కే
తీరునఁగల్గనేర్చును దదీయగతుల్ తలపోయ భాస్కరా. ౧౦౦

టీ. భాస్కరా! సారవివేకవర్తనలన్ = సార = మెఱుఁగైన, వివేక = జ్ఞానముతోఁగూడిన, వర్తనలన్ = నడతచేత, సన్నుతికిన్ = పొగడ్తకు, ఎక్కినవారిలోపలన్ = తగినవారితోఁ గూడ, చేరినయంతన్ = సావాసముచేసినంత మాత్రములోనె, మూఢులకున్ = మూర్ఖులకును, ఆనడత = అజ్ఞానమార్గవర్తనము, చేపడదు = లభింపదు. ఉదాహరణము- ఎట్టులన్నన్ = ఎట్లనఁగా, కాసారములోనన్ = సరస్సులో, హంసముల సంగతిన్ = హంసలతోఁగూడి, ఉండెడి = ఉండునట్టి, కొంగపిట్టకున్ = బకమునకు, తదీయగతుల్ = తదీయ = ఆహంసల యొక్క, గతుల్ = నడకలు, తలపోయన్ = యోచింపఁగా,

ఏతీరునన్=ఎట్లు, కల్గన్, నేర్పును=కలుగఁగలవు.

తాత్పర్యము. సద్వర్తనులలో దుర్మార్గులు సావాసము చేసినను వారిగుణములు వీరికిఁబట్టుపడవు. కొలఁకులలో హంసలలో పాటుసంచరించు హంసలనడకలు కొంగలకుఁ బట్టుపడినవా.

ఉ. స్థానము దప్పి వచ్చునెడఁ దా నెటువంటి బలాఢ్యుఁడు న్నిజ
స్థానికుఁడైన యల్పునికతంబున నైనను మోసపోవుఁగా;
కానలలోపల న్వెడలి గంధగజం బొకనాఁడు నీటిలోఁ
గానక చొచ్చిన న్మొసలికాటుకు లోఁబడదోటు భాస్కరా.

టీక. భాస్కరా! ఎటువంటి బలాఢ్యుఁడు=ఎంతటిబలవంతుఁడుగా, తాన్ + ఐనన్ = తానైనను, స్థానము=తనయునికిని, తప్పి=వదలి, వచ్చునెడన్=బైటికి వచ్చినయెడల, నిజస్థానికుఁడు=తనయింటనున్నవాఁడు, ఐనయల్పునికతంబున నైనను=అయినట్టి హీనునివలనఁగూడ, మోసపోవున్ + కా= వంచనఁబొందును. ఉదాహరణము- ఒకనాఁడు= ఒకప్పుడు, గంధగజంబు=మదపుటేనుఁగు, కానలలోపలన్=తానుండు వనములోనుండి, వెడలి=బైటికివచ్చి, కానక=స్థలపరిచయము లేక, నీటిలోన్=జలములలో, చొచ్చినన్=చొరఁబడినంతనే, మొసలికాటునకున్=మకరముయొక్క కఱపునకు, లోఁబడదోటు=చిక్కుపడినదిగాదా.

తాత్పర్యము. ఎంతబలశాలియైనను స్వస్థానములో నున్నబలము పరస్థలమున నుండదు. అపరస్థలములోనున్నయొక్క యల్పుఁడు, తనకది స్వస్థలముగుటచే నాబలవంతుని మోస

పుచ్చుఁగలఁడు. తొల్లి గజేంద్రుఁడు వనమువిడిచి జలములోనికి దిగి మొసలిచేతఁ జిక్కువడలేదా.

చ. సిరిగలవాని కెయ్యెడలఁ జేసినమేలది నిష్ఫలం బగు
న్నెఱి గుఱిగాదు పేదలకు నేర్పునఁ జేసిన సత్ఫలంబగున్ ;
వఱపునవచ్చి మేఘుఁ డొకవర్షము వాడినచేల మీఁదటం
గురిసినఁగాక యంబుధులఁ గుర్వఁగ నేమిఫలంబు భాస్కరా.

టీక. భాస్కరా! సిరి, కలవారికిన్=ఐశ్వర్యవంతునకు, ఎయ్యెడలన్=ఎప్పుడైనను, చేసినమేలు=ఒనర్చినయుపకృతి, అది, నిష్ఫలంబు + అగున్=అదిలాభము లేకుండఁజెడిపోవును నెఱి, గుఱి, కాదు=వానికినిందు విశ్వాసముండదు, పేదల కున్=దరిద్రులకు, నేర్పునన్=చక్కగా చేసిన=మేలుకావించినయెడల, సత్ఫలంబు + అగున్=లాభకారియగును, (చేసిన దానికిసార్థకమగును). ఉదాహరణము- మేఘుఁడు=మేఘము, వఱపునన్=అనావృష్టిసమయములో, వాడినచేలమీఁదన్= ఎండియున్నసస్యముమీఁద. ఒకవర్షమున్=ఒక్కవాన, కురిసి నన్-కాక=కురిసినప్పుడే లాభముగాని, అంబుధులన్=మహా సముద్రములలో, కుర్వఁగన్=వానకురిసినయెడల ఏమిఫలం బు=లాభమేమైనంగలదా.

తాత్పర్యము. ధనికునకు దానముచేసినది వెంప్పలేకుండ వ్యర్థమైపోవును. మబ్బులు వాడిపోయినచేలమీఁదఁ గురిసిన వర్ష ముపయోగించును గాని సముద్రములలో దిమ్మరించిన యెడల నది యెవ్వరికిలాభము.

చ. సిరివలెనేని సింహగుహచెంత వసించినఁ జాలుసింహము
 ల్కరులవధింపగా నచటఁగల్గునుదంతచయంబుముత్యముల్
 హరువుగ నక్కబొక్కకడ నాశ్రయమందిననేమి గల్గెడిం
 గొరిసెలుదూడతోఁకలునుగొమ్ములునెమ్ములుగాక భాస్కరా

టీక. భాస్కరా! సిరి=ఐశ్వర్యము, వలెను+ఏని=వ
రునకుఁగావలసియున్నచో, సింహగుహచెంతన్=సింహమునివ
సించుకొండగుహయొక్క ప్రక్కను, వసించినన్=ఉండినచో,
చాలున్=కావలసినంత సిరిలభించును, ఎట్లనగ సింహముల్=
గుహలోపలి సింగములు, కరులన్=ఏనుగులను (కరము=
తొండము, కరముగలది, కరి) వధింపఁగాన్=చంపితినఁగామిగి
లిన, దంతిచయంబున్=ఏనుఁగుకొమ్ములు (దంతములును),
ముత్యముల్=ఏనుఁగుల కుంభస్థలములలోని ముత్యములను అ
చటన్=అగుహయొద్ద, కల్గును=లభించును, కాని యితరత్ర
లభింపవు. ఉదాహరణము. హరువుగన్=చక్కఁగా, నక్క
బొక్కకడన్=నక్కలుండు భూబిలములయొద్ద, ఆశ్రయము+
అందినన్=కాచుకొనియున్నచో, గొరిసెలు=కాలిగిట్టలును,
దూడతోఁకలున్=దూడలతోఁకముక్కలును, కొమ్ములు=
పశువులకొమ్ములును, ఎమ్ములున్+కాక=ఎముకలునేగాని,
ఏమిగల్గెడున్=ఏమినంపదలభించును.

తాత్పర్యము. ఎవ్వడయినను నీచాశ్రయము చేయఁ
గూడదు. మహదాశ్రయమును లాభముకలదని చెప్పుచు
న్నాఁడు. సింహపుగుహయొద్దనున్నచో నేనుఁగుకొమ్ములు,

ము త్తెము దొరకును. ఇది సిరిలభించుటకు మార్గము. నక్క పొక్కకడ సలిపిన నేమిలాభము. అవితినఁగా మిగిలిన దూడ తోఁకలు, కొమ్ములు, గిట్టలు, ఎముకలునే దొరకును.

చ. స్థిరతర ధర్మవర్తనఁ బ్రసిద్ధికి నెక్కినవాని నొక్కము
ష్కరుఁడతినీచవాక్యములఁగాదని పల్కిననమ్మహాత్ముఁడుం
గొఱఁత వహింపఁడయ్యెడ నకుంఠితపూర్ణసుధాపయోధిలో
నరుగుచుఁ గాకిరెట్ట యిడినందున నేమికొఱంత భాస్కరా.

టీక. భాస్కరా! స్థిరతరధర్మవర్తన౯=ధర్మమార్గము నందుదృఢముగానుండినందున, ప్రసిద్ధికి౯ + ఎక్కినవాని౯ + ధర్మాత్ముఁడనియందఱచేఁగొని యాడఁబడు నతనిని, ఒక్కముష్కరుఁడు=ఒక కఠినుఁడు, అతినీచవాక్యముల౯=మిగులనిందావాక్యములచేత, కాదని=వీఁడుధర్మాత్ముఁడుకాఁడని, పల్కిన౯=నిందించినను, ఆ + మహాత్ముఁడు౯=ఆధర్మాత్ముఁడు, కొఱఁతన్=తక్కువతనమును, వహింపఁడు, పొందఁడు. ఉదాహరణము- అకుంఠితపూర్ణ సుధాపయోధిలో౯=అకుంఠిత= తక్కువకాని, పూర్ణ=నిండిన, సుధాపయోధిలో౯=పాల సముద్రములో, కాకి=వాయసము, అరుగుచున్=ఎగిరిపోవుచు, రెట్ట + ఇడినందున౯=శ్రద్ధించినంతనే, ఏమికొఱంత=పాల సముద్రమునకు, లోపమేమయినఁగలుగునా.

తాత్పర్యము. లోకమంతయు ధర్మాత్ముఁడని పొగడు ఘనుని నెవ్వఁడో మూర్ఖుఁడు నిందించినంతనె వానికి నీచదశ రాదు. అతనికిలోపమురాదు. సముద్రములోఁ గాకి రెట్టవేసిన యెడల, వండలినీటి కేమైన నపవిత్రత గల్గినదా.

చ. సిరిగలనాఁడు లభ్యమగుఁ జిత్తమునందుఁ దలంచినంతనే
నరులకునెట్టికార్యమయినన్ జతకాదు బహుప్రయత్నముల్
జరిపిననైన లేమిమెడ; సత్యము సుమ్మిది; చేతికందువం
డరయఁగ దోఁటికందదుగదా యనుసామ్యముపోల్కి భాస్కరా.

టీక. భాస్కరా! నరులన్=జనులకు, సిరి=ఐశ్వర్యము, కలనాఁడు=ఉన్నపుడు, చిత్తమునందున్=మనస్సులో, తలంచినంతనే=సంకల్పించికొన్నంతలోనె, ఎట్టి కార్యమైనన్=ఎటువంటి పనియైననుగూడ, లభ్యము+అగున్=జతపడును, (సిద్ధించును), లేమిమెడన్=సంపదలేనిదినములలో, బహుప్రయత్నముల్=పెక్కుయత్నములు, జరిపినన్+ఐనన్=చేసినంగాని, జతకాదు=కార్యముసిద్ధింపదు, ఇది=ఈవిషయము, సత్యముసుమ్ము=వాస్తవమేసుమా. ఉదాహరణము- చేతికిన్=హస్తమునకు, అందు=దొరకునట్టి, పండు=ఫలము, అరయఁగన్=ఆలోచింపఁగా, దోఁటికిన్=కాయలు కోయుటకై వెదురుచివరఁగట్టిన చిక్కమునకు, అందదుకదా=దొరకదుకదా, అనుసామ్యముపోల్కిన్=లోకులుచెప్పుకొను లోకోక్తి ననుసరించి.

తాత్పర్యము. సంపదగల యప్పుడు నరుఁ డేపనితలంచినను అదియింతలోనె నెఱవేఱును. దరిద్రము తన్నలమికొన్నపుడు తలచినపనినెఱవేఱదు. చేతికందునట్టిపండే కొంతకాలమునకు దోఁటికందదు.

ఉ. స్థాపకధీమంతులగు పుత్త్రులఁగాంచినఁగాక మూర్ఖము
ర్ఖులఁ గనంగఁ దేజములు గల్గవుగా మహోజ్జ్వలాంగుళా

భరణము లంగుళంబుల శుభస్థితిఁ బెట్టినఁగాక గాజుటుం
గరములు పెట్టి నందున వికాసము గల్గునటయ్య భాస్కరా.

టీక. భాస్కరా! స్ఫారతరకీర్తిమంతులు=ప్రసిద్ధమైన యశస్సుగలవారు, అగుపుత్త్రులన్=అట్టికుమారులను, కాంచినన్ + కాక=కనవలయునేగాని, మూఢముష్కరులను, మూఢ=అజ్ఞానులను, ముష్కరులను=మోటవాండ్రను, కనంగన్=కనుటవలన, తేజములు=ప్రఖ్యాతులు, కల్గవుగా=దొరకవుగదా. ఉదాహరణము- అంగుళంబులన్=చేతివ్రేళ్ళకు, మణికాంగుళాభరణములు=మణులుదాపిన యుంగరములు, శుభస్థితిన్=మేలుగా, పెట్టినన్ + కాక=ధరించిననేకాక, గాజుటుంగరములు=గాజుతాలుగూర్చినయంగుళీయకములను, పెట్టినందునన్=వ్రేలికిఁ బెట్టుకొన్నందున, వికాసము=సౌందర్యము, కల్గునటయ్యా=కలుగనేరదుగదా.

తాత్పర్యము. సుగుణములుగల కుమారులం గనినఁ బ్రసిద్ధి కలుగునుగాని మూర్ఖులను కఠినులను గనిన ఫలము లేదు. చేతివ్రేళ్ళకు రత్నములు పొదిగిన బంగరుటుంగరములు పెట్టుకొనిన శోభవచ్చును గాని గాజుతాళ్లు పొదిగిన యుంగరములతో శోభ కలుగదు.

ఉ. సేవగవాంఛితాన్నము భుజింపఁగలప్పుడు గాని లేనిచో
మనులు దప్పియుంట నిజమేకద దేహులకగ్ని హోత్రుఁడా
నే నిజభోజ్యముల్గుడుచు నేనియుఁ బుష్టివహించు లేనినాఁ
డూని విభూతిలో నడఁగి యుండఁడె తేజముదప్పి భాస్కరా.

టీక. భాస్కరా! నేఁగ=చాల, వాంఛితాన్నము=ఇష్టమైన భోజనమును, భుజింపఁగలప్పుడు=తినుచుండఁగలిగినప్పుడే, కాని, లేనిచోన్=అన్నముదొరకనియప్పుడు, దేహులకున్=ప్రాణులకు, మేనులు=దేహములు, డస్సియుంట=వాడియుండుట, నిజమేకద=సత్యమేకదా. ఉదాహరణము- అగ్నిహోత్రుఁడు + ఔన్ + ఏని=ఎంతటితేజస్సుగలయగ్నిదేవుఁడయినను సరియే, నిజభోజ్యముల్=తనకుఁగావలసిన యాహారములు, కుడుచుచు నేనియున్=భుజించిననే, పుష్టి=వర్ధనమును, వహించున్ = చెందును, లేనినాఁడు = ఆహారములేనియప్పుడు, తేజమున్=తన కాంతిని, తప్పి=పోయి, ఊని=పూని, విభూతిలోన్=బూడిదలోనఁగప్పుకొని, అడఁగియుండఁడె=దాఁగియుండుటలేదా.

తాత్పర్యము. ప్రాణికోటికిఁ గడుపునిండ నాహారమున్నపుడె పుష్టికలుగునుగాని తిండిలేనివాళ్లలో నన్నగిల్లియుందురు. అగ్నిహోత్రునికిఁగూడ నేదోయింత హారములోనఁబడుచుండిననే వెలుగునుగాని లేకున్నచో నిస్తేజుఁడై బూడిదలోఁ గప్పవడియుండును.

ఉ. మేలిని బుట్టుబుద్ధి తిరమైన విధంబునఁ బెట్టుబుద్ధులా
వేళల కంటెగాని మఱివెక్కసు నిల్వవు; హేమకాంతి యె
న్నాళులకుండుఁగాని యొకనాఁడు పదంపడి సానఁబట్టినం
జాలుకయుండునే యినుపకాటుకఁజాయలు పోక భాస్కరా.

టీక. భాస్కరా! మేలిన్=బాగుగా, పుట్టుబుద్ధి=తన

కుంబుత్తైచుబుట్టినబుద్ధి, తిరము=చెడనిది, వినపిథంబున్ =
అయినట్లు, పెట్టుబుద్ధులు=బోధించిన నేర్పులుబుద్ధులు, ఆవేళ
కున్=ఆసమయమునకు మాత్రమే, అంతేకాని=అంతకంటె,
మఱివెన్క కు=ఇంకఁగొంతముందు కాలముగూడ, నిల్వవు=
స్థిరముగావు)నిలిచియుండవు. ఉదాహరణము. హేమకాంతి=
బంగారమునకున్న తళుకు, ఎన్నాళ్లకున్=ఎన్నినాళ్లకయినను,
ఉండునుగాని=నిల్చునేకాని,ఒకనాఁడు=ఒక్కనాఁడువూర్తిగా,
పదంపడి=వూనికతో,సానఁబట్టిన్=మెఱుఁగుసానలో,దీర్చినను,
ఇనుపతాలకున్=ఇనుపరేకువకుచాయలు=కాంతులు, పోక=
పొలఁగిపోక, తాళక=నిలిచి, ఉంతునే=ఉండునా.

తాత్పర్యము. నీరులకు, సహజముగాఁ గలిగినబుద్ధివలె
ర్చిపెట్టిన బుద్ధి యెంతకాలమో నిలువదు. బంగారురేకునకుఁ
ంతి సర్వకాలము నుండునుగాని యినుపరేకునకు సానఁబట్టిన
కు కొన్నినాళ్లుండును.

. హీనకులంబునందు జనియించిన వారికి సద్గుణంబు లె
న్నేనియుఁ గల్గియున్న నొకనేరము చెందకపోదు; పద్మముల్
భానుతిఁగాంచియున్ బురదఁబుట్టుటవల్ల సుధాకరోదయం
బైననవ్యా మొందవె ప్రియంబునఁ జూడఁగలేక భాస్కరా.

టీక. భాస్కరా! హీనకులంబునందున్=తక్కువకుల
లో, జనియించినవారికిన్=జననమొందినవారికి, సద్గుణంబు
=సుగుణములు, ఎన్నేనియున్=ఎన్నియైనను, కల్గియున్న=
లిగియున్నప్పటికిని, ఒకనేరము=ఒక్కతప్పితము, చెంద

కుఁబుట్టైనబుట్టినబుద్ధి, తిరము=చెడనిది, వినపితంబులన్= అయినట్లు, పెట్టుబుద్ధులు=బోధించిన నేర్పులుబుద్ధులు, ఆవేళ కున్=ఆసమయమునకు మాత్రమే, అంతెకాని=అంతకంటె, మఱివెన్కకు=ఇంకఁగొంతముందు కాలముగూడ, నిల్వవు= (స్థిరముగావు)నిలిచియుండవు. ఉదాహరణము- హేమకాంతి= బంగారమునకున్నతళుకు, ఎన్నాళ్లకున్=ఎన్నినాళ్లకయినను, ఉండునుగాని=నిల్చునేకాని,ఒకనాఁడు=ఒక్కనాఁడుపూర్తిగా, పదంపడి=పూనికతో,సానఁబట్టిన్=మెఱుఁగుసానలో,దీర్చినను, ఇనుపతాటకున్=ఇనుపరేకువకుచాయలు=కాంతులు, పోక= తొలఁగిపోక, తాళక=నిలిచి, ఉండునే=ఉండునా.

తాత్పర్యము. నీరులకు, సహజముగాఁ గలిగిన బుద్ధివలె నేర్పిపెట్టిన బుద్ధి యెంతకాలమో నిలువదు. బంగారురేకునకుఁ గాంతి సర్వకాలము నుండునుగాని యినుపరేకునకు సానఁబట్టిన తళు కన్నినాళ్లుండును.

ఉ. హీనకులంబునందు జనియించిన వారికి సద్గుణంబు లె
న్నేనియుఁ గల్గియున్న నొకనేరము చెందకపోదు; పద్మముల్
భానుతిఁగాంచియున్ బురదఁబుట్టుటవల్ల సుధాకరోదయం
బైనసహ్యమొందవె ప్రియంబునఁ జూడఁగలేక భాస్కరా.

టీక. భాస్కరా! హీనకులంబునందున్=తక్కువకుల ములో, జనియించినవారికిన్=జననమొందినవారికి, సద్గుణంబులు=సుగుణములు, ఎన్నేనియున్=ఎన్నియైనను, కల్గియున్న= కలిగియున్నప్పటికిని, ఒకనేరము=ఒక్కతప్పితము, చెందక

